బాలానంద
# బొమ్మల శ్రీకృష్ణ లీలలు

రచన. రెంటాల గోపాలకృష్ణ

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్ .................... విజయవాడ-2

ప్రథమ ముద్రణ
1984

ముఖచిత్రం:
బి. పి. రాజు

వెల: రు. 8-00

ప్రచురణ:
నవరత్న బుక్ సెంటర్
ఏలూర్ రోడ్, విజయవాడ-2

ముద్రణ:
"వెంకటరత్నా"
విజయవాడ-2

# మా మాట...

ఎన్ని పురాణాలు, ఎన్ని కథలు. ఎందరో మహాపురుషులు, ఎన్నో భవ్య జీవితాలు, ఒకొక్క పురాణం ఒకొక్క రసగుళిక, ఒకొక్క కథ ఇక్షుఖండం, ఒకొక్క మహాపురుషుడు ఒకొక్క దివ్యజ్యోతి, అన్నీ మనిషికి మంచిని బోధించు అక్షయనిధులే! అన్నీ సర్వకాలిక సత్యాలకు అక్షర భాష్యాలే!

అందుకే వేలాది సంవత్సరాలుగా మన పురాణాలు, రామాయణ, భారత, భాగవతాలు ప్రతియింటా యేదో ఒక రూపంలో చెప్పుకుంటూనే ఉన్నాం బాలబాలికలకు. ఆమాటకు వస్తే అక్షరాలు నేర్చిన చదువరు లందరికీ ఆ పురాణ కథల్ని రామాయణ, భారత, భాగవత, విశేషాల్ని మహామనుషుల గాథల్ని సాధ్యమైనంత సరళ, సుందర శైలితో అందించాలని మా సంకల్పం. ఆ ప్రయత్నఫలమే ఈ పుస్తకము.

ఎన్నో అపూర్వ విషయాలు చర్చించబడిన పెద్ద గ్రంథాలకు దారి చూపే దీపాలు మాత్రమే ఇవి. ఈ చిరుకాంతులలో భారతీయ సాహిత్య భాండాగారాన్ని అన్వేషించుకొనే భావి భారత పౌరులకు ఇవి మా చిరుకానుకలు అందుకోండి! మా ప్రయత్నాన్ని ప్రోత్సహించండి! ఉత్తమ సాహిత్య సృష్టికి, ప్రచురణకు ప్రేరణ యివ్వండి!!

ప్రచురణ కర్తలు

# లోపలి పేజీలలో

# బాలానంద బొమ్మల శ్రీకృష్ణ లీలలు

ద్వాపరయుగంలో విష్ణుమూర్తి, శ్రీకృష్ణుడుగా భూమి మీద అవతరించాడు. దుష్టులను శిక్షించి, ధర్మాన్ని రక్షించడం కోసమే అవతారం ఎత్తాడు ఆయన.

ఆకాలంలో మధురానగరం యాదవరాజులకు రాజధానిగా ఉండేది. యాదవరాజులలో శూరసేనుడు ప్రసిద్ధుడు. ఆయన కుమారుడే మహాత్ముడైన వసుదేవుడు. మధురను ఉగ్రసేనుడు పరిపాలిస్తున్నాడు. ఆయన కుమారుడు కంసుడు. అతను దుష్టుడు. రాక్షసప్రవృత్తి కలవాడు. విష్ణుమూర్తి అంటే గిట్టదు అతనికి. దుర్మార్గులతో అతని స్నేహం. కంసుడు తన తండ్రి ఉగ్రసేనుణ్ని చెరలోపెట్టి తానే రాజై, క్రూరంగా పరిపాలన సాగిస్తూ వచ్చాడు.

కంసుడి పినతండ్రి కుమార్తె దేవకి. ఆమె పుణ్యాత్మురాలు. వసుదేవుడు దేవకిని పెళ్ళాడాడు. దేవకిని తొలిసారిగా అత్తవారింటికి పంపేటప్పుడు అన్న కంసుడు వెంట వెళ్ళాడు. చక్కగా అలంకరించిన రథంపై చెల్లెలినీ, బావగారినీ కూచోబెట్టుకుని తానే రథం నడిపాడు. చెల్లెలిని అత్తవారింటికి తీసుకుని వెడుతున్నానుకదా అని కంసుడు ఎంతో సంతోషించాడు. కాని అప్పుడొక చిత్రం జరిగింది.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

"ఓయీ, కంసా! మురిసిపోకు. ఈ దేవకి కడుపున పుట్టే ఎనిమిదవ బిడ్డవల్ల నీకు ప్రాణగండం ఉన్నది సుమా! ఆ బిడ్డచేతుల్లో నీకు చావుతప్పదు" అనే మాటలు వినిపించాయి.




ఆమాట విని కంసుడు అదిరిపడ్డాడు. చుట్టూ కలయచూశాడు. ఎవరూ కనిపించలేదు. అవి ఆకాశవాణి పలికిన పలుకులని గ్రహించాడు. ఎక్కడలేని భయం, కోపం అన్నీ ఆవహించాయి. వెంటనే రథం

ఆపి, క్రిందికి దూకేడు. చెల్లెలు దేవకిని సిగపట్టుకుని రథం మీదినుంచి క్రిందికి లాగాడు. మొలలో వున్న కత్తి దూశాడు.

"ఓసీ, నీవు నాకు చెల్లెలివి కాదు. నా ప్రాణం తీయడానికి పుట్టిన రాక్షసివి" అంటూ దేవకిని చంపబోయాడు.

అప్పుడు దేవకి భర్త వసుదేవుడు తటాలున అడ్డుపడి "బావా! ఈమె నీ చెల్లెలు. పైగా కొత్త పెళ్ళికూతురు. ఈమెను చంపడం న్యాయంకాదు. ఈ దేవకికి పుట్టే బిడ్డలందరినీ ఎప్పటికప్పుడు తెచ్చి నీకు అప్పగిస్తాను. ఇక నీకు భయమెందుకు?" అని మాట యిచ్చాడు. దేవకిని చంపవద్దని కాళ్లా వేళ్ళా పడి బ్రతిమాలాడు.

అది విని కంసుడు శాంతించాడు. దేవకిని చంపకుండా విడిచిపెట్టాడు.

కొంత కాలానికి దేవకికి ఒక కొడుకు పుట్టాడు. ఆడినమాట తప్పకుండా వసుదేవుడు ఆ బిడ్డను తీసుకునిపోయి కంసుడికి అప్పగించాడు. వసుదేవుడి సత్య సంధతకు మెచ్చుకుని కంసుడు ఆ బిడ్డను మళ్ళీ వసుదేవుడికి ఇచ్చివేశాడు.

ఇలా వుండగా ఒకనాడు నారదమహర్షి కంసుడి దగ్గరికి వచ్చి వసుదేవుడూ, వ్రేపల్లెలో ఉండే యాదవులూ దైవాంశ సంభూతులనీ, దేవకిగర్భాన శ్రీ మహావిష్ణువు జన్మించ నున్నాడని, నిన్ను సంహరించ నున్నాడని చెప్పాడు.

అది వినగానే కంసుడికి మళ్ళీ క్రోధం చెలరేగింది. దేవకికి పుట్టిన మొదటి బిడ్డను చంపివేశాడు. దేవకీ వసుదేవుల కాళ్ళకూ చేతులకూ సంకెళ్ళు వేసి చెఱసాలలో ఉంచాడు. కారాగృహం చుట్టూ భటులను కాపలాపెట్టాడు.

చెఱసాలలో వున్న దేవకీ వసుదేవులకు అక్కడే ఏటేటా సంతానం కలిగింది. ఆ బిడ్డలందరినీ కంసుడు నిర్దాక్షిణ్యంగా సంహరిస్తూ వచ్చాడు. ఆ విధంగా దేవకి బిడ్డలు ఆరుగురునీ కంసుడు పొట్టన పెట్టుకున్నాడు. ఏడవసారి దేవకి గర్భం ధరించింది, భగవంతుడి సంకల్పంవల్ల ఆదిశేషుడు ఆమెగర్భంలో ప్రవేశించాడు. అయితే, భగవంతుడి ఆదేశానుసారం యోగమాయ, దేవకి గర్భంలో వున్న ఆదిశేషుని తేజస్సును ఆకర్షించి దాన్ని నందగోకులంలో ఉన్న రోహిణిగర్భంలో ప్రవేశపెట్టింది. రోహిణి వసుదేవుడి రెండో భార్య. దుర్మార్గుడైన కంసుడికి భయపడి రోహిణి, ఇంకా చాలామంది యాదవులు వ్రేపల్లెలో వుంటున్నారు. యోగమాయ చేసిన పనివల్ల ఇక్కడ మధురలో దేవకికి గర్భస్రావం అయింది, అక్కడ వ్రేపల్లెలో రోహిణికి నెలలు నిండి, కుమారుడు పుట్టాడు. అతనే ఆదిశేషుడి అవతారమైన బలరాముడు. శ్రీకృష్ణుడికి అన్న.



# శ్రీ కృష్ణ జననం

తరవాత కొంతకాలానికి దేవకి ఎనిమిదవసారి గర్భవతి అయింది. ఆ సంగతి కంసుడు తెలుసుకుని, ఇప్పుడు పుట్టబోయే బిడ్డవల్లనే తనకు మృత్యువు కనుక, చెఱసాలలో మరింత కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేశాడు. బిడ్డ పుట్టగానే తనకు తెలియజెయ్యమని భటులకు ఆజ్ఞాపించాడు.

దేవకికి నెలలు నిండాయి. శ్రావణమాసంలో బహుళ అష్టమి రోహిణి నక్షత్రయుక్త వృషభలగ్నంలో దేవకి శ్రీకృష్ణుని కన్నది. అది అర్ధరాత్రి. విష్ణుమూర్తి దేవకి గర్భాన శ్రీకృష్ణుడుగా అవతరించగానే దేవదుందుభులు మ్రోగాయి. పూలవాన కురిసింది. కృష్ణుడు నాలుగు చేతులతో శంఖ, చక్రాది ఆయుధాలతో, సకల శుభలక్షణాలతో అవతరించాడు. దివ్య తేజస్సు వెద జల్లుతూ, శిశువు రూపంలో ఉన్న భగవంతుణ్ని చూసి దేవకీ వసుదేవులు చేతు లెత్తి మ్రొక్కారు. అప్పుడు భగవానుడు ఆ పసిబిడ్డ రూపంలో వారితో మాట్లా డాడు. "కంసుడు నన్ను చంపివేస్తాడని మీరు భయపడకండి" అని పలుకుతూ చేయవలసిన పనిని గురించి చెప్పి మళ్ళీ మామూలు బిడ్డగా మారిపోయాడు.

భగవంతుడి మహిమవలన వసుదేవుడికి సంకెళ్ళు విడిపోయాయి. చెరసాల వాకిళ్ళు వాటంతట అవే తెరుచుకున్నాయి. కావలివాళ్ళు వళ్ళు తెలియ కుండా పడి ఉన్నారు. అప్పుడు వసుదేవుడు కృష్ణుణ్ని బుట్టలో పరుండబెట్టి నెత్తిన పెట్టుకుని బయలుదేరాడు. కుండపోతగా వర్షం కురుస్తున్నది. అది

శేషుడు పడగలు విప్పి గొడుగు పట్టాడు. యమునానది రెండు పాయలుగా చీలి వసుదేవుడికి దారి ఇచ్చింది. ఆయన యమునానదిని దాటి వ్రేపల్లె చేరుకున్నాడు. అక్కడ నందుడి భార్య యశోద ఆడబిడ్డను ప్రసవించి ఉన్నది. వసుదేవుడు



కృష్ణుణ్ణి యశోదప్రక్కన పరుండబెట్టి, ఆమె ప్రక్కన వున్న ఆడపిల్లను తీసుకుని మళ్లీ నదిని దాటి మధురానగరం చేరుకుని చెరసాలలో ప్రవేశించాడు. మళ్లీ చెరసాల తలుపులు మూసుకున్నాయి. వసుదేవుడి వేళ్ళకూ చేతులకూ

సంకెళ్ళు తగులుకొన్నాయి. ఈ సంగతి ఇక్కడ మధురలోగాని, అక్కడ వ్రేపల్లెలోగాని ఎవరికీ తెలియదు. ఇక్కడ కారాగృహంలో ఆడపిల్ల ఏడుపు విని, కావలివాళ్ళు నిద్రలేచారు. పరుగు పరుగున వెళ్ళి, దేవకి కన్నదని కంసుడికి చెప్పారు. కంసుడు వెంటనే చెరసాలకు వచ్చాడు.

"అన్నా! పుట్టింది ఆడపిల్ల. నీకు ఏ అపాయం వుండదు" అని దేవకి బ్రతిమాలుతున్నా కంసుడు వినకుండా ఆ బిడ్డను చంపడానికి పూనుకున్నాడు. అయితే, భగవంతుడి మాయ అయిన ఆ శిశువు కంసుడికి అందకుండా ఆకాశంలోకి ఎగసి "ఓరీ కంసా! నన్ను చంపడం నీతరంకాదు. నిన్ను చంపేవాడు పుట్టి పెరుగుతున్నాడు!" అని పలికి అంతర్ధాన మైంది.

మూర్ఖుడైన కంసుడు నవ్వుకున్నాడు. ఆనాడు ఆకాశవాణి పలుకులు అబద్ధమనుకుని దేవకీ వసుదేవులకు సంకెళ్ళు తీయించి, వారిని విడిచిపెట్టాడు.

అక్కడ వ్రేపల్లె లో యాదవుల నాయకుడైన నందుడు, అతనిభార్య యశోద, పిల్లలులేనివారు కావడంవల్ల చాలాకాలానికి కొడుకు పుట్టినందుకు ఎంతో సంతోషించారు. ఆనాడు వ్రేపల్లెలో పెద్ద ఉత్సవం జరిపించాడు నందుడు. అదే గోకులాష్టమిగా, ఉట్ల పండుగగా లోకంలో ప్రసిద్ధి కెక్కింది.

రోహిణి కుమారుడికి బలరాముడనీ, యశోద కుమారుడికి కృష్ణుడని పేర్లు పెట్టాడు యాదవుల పురోహితుడు గర్గాచార్యుడు. బలరామకృష్ణులు శుక్ల పక్ష చంద్రకళల్లాగా దినదిన ప్రవర్ధమానమవుతూ వచ్చారు.

ఇక్కడ మధురలో కంసుడికి మనశ్శాంతి లేకుండా పోయింది. "నిన్ను చంపేవాడు పుట్టి పెరుగుతున్నాడు" అని యోగమాయ అన్నమాటలు



అతనికి జ్ఞాపకం వచ్చి, మనస్సును కలవర పరుస్తున్నాయి. వ్రేపల్లె మొదలైన పల్లెలకు వెళ్ళి, అక్కడ ప్రతి పురిటిల్లూ గాలించి, కనిపించిన పసి బాలురను వధించ వలసినదిగా మాయావులు, తన అనుచరులు అయిన రాక్షసులను పంపాడు.

# పూతన వధ

పూతన ఒక రక్కసి. బాలఘాతిని. కంసుడి ఆజ్ఞానుసారం పూతన పల్లెలలో సంచారం చేస్తూ శిశువుల ప్రాణాలు తీస్తూ చివరకు వ్రేపల్లెకు వచ్చింది. చక్కటి స్త్రీ వేషం ధరించి నందుడి ఇంట్లో ప్రవేశించింది. అప్పుడు చిన్న కృష్ణుడు బంగారపు ఉయ్యాల తొట్టిలో పడుకుని ఉన్నాడు. యశోద మొదలైన గోపకాంతలతో ఆమాటా ఈమాటా మాట్లాడుతూ కృష్ణుడిపై ఎక్కడలేని ప్రేమ ఒలకబోసింది పూతన. ఉయ్యాలలోనుంచి చిన్న కృష్ణుణ్ని తీసుకుని ముద్దులాడింది. తర్వాత ఒడిలో పడుకోబెట్టుకుని ప్రేమతో పాలు కుడిపింది.

పూతన చన్నులలో విషం ఉన్నది. చన్ను కుడిపి కృష్ణుణ్ని చంపి వేయాలని ఆమె ఆలోచన. అయితే భగవంతుడైన బాలకృష్ణుడికి ఆవిషయం తెలుసు. కృష్ణుడు పూతన చన్నులను గట్టిగా పట్టుకుని చనుబాలతోపాటు ఆమె

ప్రాణాలను కూడా పీల్చివేశాడు. అంతే! పూతన విలవిల తన్నుకుని ప్రాణాలు విడిచింది. అప్పుడు ఆమె మాయరూపం పోయి రాక్షసి రూపం బయటపడింది. అది చూసి యశోద మొదలైన స్త్రీలు భయంతో వణికిపోయారు. యశోద కృష్ణుణ్ణి గభాలున ఎత్తుకుని, ఇవతలికి వచ్చింది. కృష్ణుడికి దిష్టి తీసింది. భూత వైద్యులను పిలిపించి విభూతి పెట్టించింది. తాయెత్తులూ, రక్షరేకులూ కట్టించింది.



మరొకనాడు బాలకృష్ణుడు ఉయ్యాల తొట్టిలో పడుకుని వున్నప్పుడు కంసుడు పంపిన రాక్షసుడు బండి ఆకారంలో వచ్చి ఉయ్యాలతొట్టిమీద పడడానికి ప్రయత్నించాడు. కృష్ణుడు కాళ్ళతో ఆ బండిని తన్నాడు. బండి ముక్కలు ముక్కలై దూరంగాపోయి పడింది. ఆవిధంగా శకటాసురుడు హతమైనాడు.

ఇంకొకనాడు తృణావర్తుడనే రక్కసుడు సుడిగాలి రూపంలో వచ్చి చిన్న కృష్ణుణ్ని ఎత్తుకుని ఆకాశంలోకి ఎగిరాడు. కాని కృష్ణుణ్ని మోయలేక పోయాడు. కృష్ణుడు రాక్షసుని గొంతు గట్టిగా నులిమివేయగా వాడు క్రింద కూలిపోయి గిలగిల తన్నుకుంటూ ప్రాణాలు విడిచాడు.

కృష్ణుడు చేసిన అల్లరిపనులూ కొంటెతనాలూ అన్నీ ఇన్నీ కావు. దొంగలా ఇళ్ళలో దూరి, ఉట్టిపైకి ఎగబ్రాకి పాలు త్రాగేవాడు. వెన్నముద్దలు భక్షించేవాడు. తనతో ఆడుకునే గోపబాలకులకు కూడా అవి పంచి పెట్టేవాడు. గోపికలు వచ్చి పట్టుకోబోతే చిక్కకుండా పారిపోయేవాడు. ఎన్ని కొంటె పనులు చేసినా, ఎన్నివిధాల తిప్పలుపెట్టినా గోపస్త్రీలకు కృష్ణుణ్ని కొట్టబుద్ధి కాదు. కష్టమైనా నష్టమైనా అతని చేష్టలు వారికి సంతోషం కలిగించేవి. ముద్దుగా ఉండేవి. వయస్సులో చిన్నవాడైనా కృష్ణుడి జగన్మోహనాకారం చూడగానే గోపికలు మైమరచిపోయేవారు.

ఒకనాడు బాలకృష్ణుడు గొప్ప అద్భుతాన్ని ప్రదర్శించాడు. పిల్లలతో ఆడుకుంటూ మన్ను తిన్నాడు. ఆవిషయం తెలిసి యశోద కృష్ణుణ్ని మందలించింది.



"కృష్ణా! మన్ను తిన్నావుట్రా? ఎన్నిసార్లు చెప్పాను మన్ను తిన కూడదని? నిన్నేం చేస్తానో చూడు!" అని బెదిరించింది.

అప్పుడు కృష్ణుడు "లేదమ్మా, నేను మన్ను తినలేదు. కావాలంటే నా నోరు చూడు!" అంటూ నోరు తెరిచి చూపించాడు.

అద్భుతం! అప్పుడు చిన్ని కృష్ణుడి నోటిలో సమస్త లోకాలూ కనిపించాయి యశోదకు! ఆమె చకితురాలైంది. ఇది కలా, నిజమా. లేక మాయా అనుకున్నది భగవత్తత్త్వం ఎవరో తనకు బోధించినట్లనిపించింది.




ఆవిధంగా కృష్ణుడు, యశోదకు తన విశ్వరూపం చూపించి, మళ్లీ ఎప్పటిలా ఉండిపోయాడు. భగవంతుడే తనకు కుమారుడుగా జన్మించాడని గ్రహించింది యశోద.

# మద్దిమానులు

కృష్ణుడి అల్లరితో వేగలేక యశోద ఒకనాడు, ఒక పెద్ద తాడుతో కృష్ణుణ్ని రోటికి కట్టివేసి తన పనిమీద వెళ్ళిపోయింది. యశోద యింటి ముంగిట రెండు మద్ది చెట్లున్నాయి. కవలపిల్లల్లా జంటగా పుట్టిన మానులవి. కృష్ణుడు ఆ మానులమధ్యనుంచి రోలు ఈడ్చుకుంటూ వెళ్ళాడు. అప్పుడు రోలు చెట్లమధ్య తగుల్కొని, కృష్ణుడు గట్టిగా ఈడ్చుకుంటూ వెళ్ళినందున చెట్లు రెండూ వ్రేళ్ళతోసహా లేచివచ్చి నేలమీద కూలిపోయాయి.

అప్పుడొక చిత్రం జరిగింది. చెట్లలోనుంచి యిద్దరు దివ్యపురుషులు బయటికి వచ్చారు. వారు నలకూబరుడు, మణిగ్రీవుడు అనేవారు. యక్షరాజు కుబేరుని కుమారులు. శాపవశాన మద్దిచెట్లుగా పుట్టారు. యిప్పుడు కృష్ణునివల్ల వారికి శాపవిముక్తి కలిగింది. వారు కృష్ణుడికి నమస్కరించి తమ లోకానికి వెళ్ళిపోయారు.

కృష్ణుని బాల్యక్రీడలూ, అతను చేస్తున్న అద్భుతాలూ, ప్రదర్శిస్తున్న లీలలూ కళ్ళారా చూసే భాగ్యం కలిగింది వ్రేపల్లె ప్రజలకు. అందరి జీవితాలకూ అతనే ఆధారమైనాడు. కృష్ణుడు భగవంతుని అవతారమన్న భావం అందరిలోనూ ఏర్పడినందువల్ల అతనంటే ప్రేమ, భక్తి, గౌరవం పాదునేసుకున్నాయి అందరి హృదయాలలో.

# బృందావనంలో వింతలు

గోకులానికి దగ్గరలో వున్నది బృందావనం. అక్కడ అందమైన వనాలు అనేకం వున్నాయి. యమునానదికూడా సమీపంలో ఉండడంవలన గోపాలకులు ఆలమందలను బృందావనంలోని పచ్చిక మైదానాలలో మేపుతూ ఉండేవారు. కృష్ణుడి బాల్యం గోకులం, బృందావనం—వీటితో ముడిపడి వుంది. గోపబాలకులతో కలిసి ఆడుతూ, పాడుతూ, జగన్మోహనంగా మురళీవాయిస్తూ బృందావనంలో విహరించేవాడు కృష్ణుడు.

రామకృష్ణులు గోపాలురతోపాటు యమునాతీరాన ఆలమందలను మేపుతూ వుండగా ఒకనాడు కంసుడు పంపిన వత్సాసురుడనే రాక్షసుడు అక్కడికి వచ్చాడు. ఆవుదూడ రూపంలో వచ్చి మందలో ప్రవేశించి, మాయోపాయంతో అందరినీ చంపడానికి ప్రయత్నించాడు. అయితే కృష్ణుడు అది కనిపెట్టి వాణ్ని చంపివేశాడు. అలాగే మరొకనాడు కొంగరూపంలో వచ్చిన బకాసురుడు తనను మింగివేయడానికి ప్రయత్నించగా కృష్ణుడు వాణ్ని సునాయాసంగా చంపేశాడు. ఇంకొకనాడు బకాసురుడి తమ్ముడు అఘాసురుణ్ని హతమార్చాడు.

ఒకనాడు మరొక వింత జరిగింది. విష్ణుమూర్తి మాయ కళ్లారా చూడాలని బుద్ధి పుట్టింది బ్రహ్మదేవుడికి. ఆలమందలను కొంతసేపు పచ్చిక బయళ్ళలో మేపి, ఆ తర్వాత చద్ది అన్నాలు తింటున్నారు గోపబాలురు. కృష్ణుడు కూడా వారితో ఉన్నాడు. అప్పుడు బ్రహ్మదేవుడు ఆలమందలను మాయం

చేశాడు. తరవాత ఆలమందలు కనపడకపోయేసరికి గోపాలకులు భయపడ్డారు. కృష్ణుడితో ఆ సంగతి చెప్పారు. కృష్ణుడు వెళ్లి వనమంతా వెదికినా ఆల మందలు కనపడలేదు. తిరిగివచ్చి చూసేసరికి, గోపబాలకులు కూడా అక్కడ లేరు. వారిని కూడా బ్రహ్మదేవుడే మాయం చేశాడు. అప్పుడు కృష్ణుడు అది బ్రహ్మమాయ అని తెలుసుకుని, తన మాయతో ఆలమందనూ గోపబాలురను సృష్టించాడు. కొంతకాలం గడిచింది. అయినా ఈ సంగతి ఎవరూ కనిపెట్టలేక పోయారు. బ్రహ్మదేవుడు వచ్చి చూశాడు. నిజమైన ఆలమందలనూ గోప బాలురనూ తాను మాయ చేసి దాచిపెట్టినప్పటికీ. శ్రీకృష్ణుడు తన మాయతో వాటిని తిరిగి సృష్టించడం చూసి, తన అజ్ఞానానికి సిగ్గుపడ్డాడు. ఈ జగత్తంతా శ్రీహరి మాయ అని తెలుసుకుని, కృష్ణుణ్ని స్తుతించాడు. తను మాయచేసి దాచి వుంచిన ఆలమందలనూ. గోపాలకులనూ కృష్ణుడికి సమర్పించి అనుగ్ర హించమని ప్రార్థించాడు. అప్పుడు కృష్ణుడు బ్రహ్మదేవుణ్ని కరుణించి తన మాయ ఉపసంహరించాడు.



# కాళీయ మర్ధనం

యమునా నదిలో కాళింది అనే ఒక మడుగు ఉంది. ఆ మడుగులో కాళీయుడనే సర్పరాజు తన కుటుంబంతో ఎంతోకాలంగా నివాసం ఏర్పరచుకుని ఉంటున్నాడు. అందువల్ల ఆ మడుగులో నీరు విషపూరితమైంది. ఆనీరు త్రాగిన వారెవరూ బ్రతికరు. ఒకనాడు గోవులూ, గోపాలకులూ ఎండవేడికి దాహంతో తట్టుకోలేక కాళింది మడుగులో నీరు త్రాగి వెంటనే స్పృహతప్పి పడిపోవడం జరిగింది. అప్పుడు కృష్ణుడు తన మహిమతో ఆలమందలనూ, గోపాలకులనూ మళ్లీ స్పృహ వచ్చేలా చేశాడు. అంతా ఆశ్చర్యంతో చూస్తుండగా మడుగులో దూకాడు. నీళ్ళన్నీ అల్లకల్లోలం చేస్తూ, మడుగులో వీరవిహారం చేశాడు. అప్పుడు కాళీయుడు పడగలు విప్పి విషాగ్నులు విరజిమ్ముతూ నీళ్ళలో నుంచి పైకి వచ్చాడు. కృష్ణుణ్ని చుట్టివేశాడు.

ఆ దృశ్యం చూసి గోపాలకులు భయకంపితులై హాహాకారాలు చేశారు. కొందరు వ్రేపల్లెలోకి పరుగెత్తుకుంటూ వెళ్లి ఈవిషయం చెప్పడంతో పల్లెప్రజలంతా మడుగు దగ్గరికి వచ్చి, కృష్ణుడు మహా విపత్తులో చిక్కి వుండడం చూసి గోడు గోడున దుఃఖించారు. అయితే చిన్నికృష్ణుడు సర్పరాజు పట్టు విడిపించుకుని గభాలున పడగలమీదికి ఎక్కి, పాదాలతో చిందులు త్రొక్కుతూ చిత్రవిచిత్రంగా నాట్యం చేశాడు. అలా మర్ధిస్తూ కాళీయుడి మదం అణచివేశాడు. సర్పరాజు శిరస్సులు వాలిపోయాయి. నోళ్ళనుండి నెత్తురు కక్కుతూ ప్రాణావశిష్టుడై రక్షించమని శ్రీహరిని వేడుకున్నాడు. అంతలో

కాళీయుడి భార్యలు, బిడ్డలు మడుగులోనుంచి లేచి వచ్చారు. కాళీయుడిని కాపాడ మని కృష్ణుణ్ని ప్రార్థించారు.



కృష్ణుడు దయదలచి కాళీయుణ్ని విడిచిపెట్టాడు. తనను క్షమించ మని వేడుకున్నాడు కాళీయుడు. అంతట కృష్ణుడు "ఆమడుగు విడిచి వెళ్లి పొమ్మ"నమని సర్పరాజును ఆజ్ఞాపించాడు.



"కాళీయుడా! నేను తాండవం చేసిన కారణంగా నీ శిరస్సులపై నా పాదచిహ్నాలు ఏర్పడతాయి. అవి చూసి గరుత్మంతుడు నీ దగ్గరికి రాకుండా, నిన్ను చంపకుండా ఉంటాడు" అని కాళీయుడికి వరం యిచ్చాడు కృష్ణుడు.

సర్పరాజు తన భార్యా, బిడ్డలతో కాళింది మడుగు విడిచిపెట్టి, సముద్రంలోకి వెళ్ళిపోయాడు, అప్పటినుంచీ కాళింది మడుగులో నీళ్ల పరిశుభ్రమై త్రాగడానికి యోగ్యమైనాయి. కృష్ణుడు చేసిన ఈ అద్భుతాన్ని చూసి వ్రేపల్లె ప్రజలు పరమానందభరితులయినారు.

ఇలా శ్రీకృష్ణుడు చిన్నతనంలో ప్రదర్శించిన లీలలు ఎన్నో వున్నాయి. అడవిలో ఒకనాడు కార్చిచ్చు క్రమ్ముకునిరాగా, భయంకరమైన ఆ దవాగ్నిని మ్రింగివేసి గోవులను, గోపాలకులను రక్షించాడు. గోపికలు వస్త్రాలు విడిచి కాళింది నదిలో స్నానం చేస్తుండగా కృష్ణుడు వారి చీరలు అపహరించి చెట్టెక్కి కూచుని, వారిని పరాచకాలు పట్టించాడు. వారి భక్తిని పరీక్షించిన పిదప వారి చీరలు వారికి ఇచ్చివేశాడు.

## గోవర్ధనోద్ధరణం

వ్రేపల్లెలో ప్రజలు ప్రతి సంవత్సరం ఇంద్రుడి ప్రీతికోసం యాగం చేసేవారు. అలా చేస్తే వర్షాలు బాగా కురుస్తాయని, పంటలు సమృద్ధిగా పండుతాయని వారి నమ్మకం. ఆ సంవత్సరం కూడా ఇంద్రయాగం చేయడానికి యాదవులు సన్నాహాలు చేశారు, అయితే, కృష్ణుడు సమ్మతించలేదు. గోకులా



నికి దగ్గరలో గోవర్ధనగిరి వుంది. ఆ కొండమీద పుష్కలంగా పచ్చిక దొరుకుతుంది. గోవులకు, గోపాలకులకూ ప్రాణాధారమైన పర్వతం అది. అందువల్ల ఆ కొండకు పూజలు చేయాలన్నాడు కృష్ణుడు. యాదవ ప్రముఖులు అందుకు అంగీకరించారు. సమస్త ద్రవ్యాలూ సమకూర్చుకుని వ్రేపల్లె ప్రజలందరూ గోవర్ధనగిరికి వెళ్లి, పూజలు చేశారు. ఆ కొండకు ప్రదక్షిణాలు చేసి బలులు సమర్పించారు-ఆవిధంగా గోవర్ధనోత్సవం వైభవంగా జరిగింది.

అయితే, ఎప్పటిలా యాదవులు తన ప్రీతికోసం యాగం చేయనందుకు ఇంద్రుడికి ఆగ్రహం వచ్చింది. మేఘ గణాలను పిలిచి "మీరు వెళ్లి గోకులంపై జడివాన కురిపించి అల్ల కల్లోలం చేయండి. గోగణాలనూ గొల్లపల్లెలనూ సర్వనాశనం చేయండి" అని ఆజ్ఞాపించాడు.

ఇంకేముంది? గోకులంలో ఎన్నడూలేని జడివాన. ఉరుములు, మెరుపులతో, భయంకరంగా ఆకాశం చిల్లులు పడినట్లుగా, ఏనుగు తొండం అంత ధారలతో వర్షం కురవడం మొదలుపెట్టింది. ఆ తరవాత భయంకరంగా రాళ్ళవాన కురవడం ప్రారంభమయింది. ఆలమందలు దీనంగా అరవసాగాయి. ప్రజలు దిక్కుతోచక ఆర్తనాదాలు చేశారు. అప్పుడు కృష్ణుడు గోవర్ధన గిరిని ఒక్కచేత్తో అవలీలగా పైకి ఎత్తాడు. "మీకేం భయంలేదు. ఆలమందలను తోలుకుని మీరంతా ఈ కొండక్రిందికి రండి" అని చెప్పాడు.

అలాగే యాదవులు గోగణాలతో వచ్చి ఆ కొండక్రిందికి చేరారు. కృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని తన చిటికెన వ్రేలిపై కదలకుండా నిలిపి గొడుగులా పట్టుకున్నాడు. ఏడురోజులు కురిసింది రాళ్ళవాన. ఆ ఏడురోజులూ కొండను అలాగే ఎత్తిపట్టుకుని ఉన్నాడు కృష్ణుడు.

తన ప్రయత్నం వ్యర్థం కావడంతో ఇంద్రుడికి గర్వం అణిగింది. భగవంతుడైన కృష్ణుని మహిమ తెలుసుకున్నాడు. మేఘాలను ఉపసంహరించి, తనను మన్నించమని శ్రీహరిని వేడుకున్నాడు. వాన వెలిసింది. యాదవులు, మళ్లీ ఎప్పటిలా సురక్షితంగా గోకులం చేరుకున్నారు. ఆవిధంగా గోవర్ధనగిరి ఎత్తి గోకులాన్ని కాపాడిన ఏడేండ్ల బాలుడు కృష్ణుడిపై దేవతలు పూలవాన కురిపించారు.

ఒక పుణ్యదినంనాడు నందుడు యమునలో స్నానం చేస్తుండగా వరుణుడి భటుడు అతన్ని పట్టుకునిపోయాడు. నదిలో మునిగిన నందుడు కని పించక పోయేసరికి గోపకాంతలు రోదనం చేయసాగారు. అప్పుడు కృష్ణుడు వరుణలోకానికి వెళ్ళి తండ్రిని తిరిగి తీసుకునివచ్చి అందరికీ సంతోషం కలిగిం చాడు. అలాగే మరొకనాడు శంఖచూడుడనే వాడు గోపికలను అపహరించుకుని పోగా, కృష్ణుడు గోపికలను విడిపించి, శంఖచూడుణ్ని సంహరించాడు. ఇంకొక రోజు కంసుడు పంపిన ముగ్గురు రాక్షసులను కూడా యమపురికి పంపాడు. ఎద్దు రూపంలో వచ్చిన అరిష్టుడనే రాక్షసుణ్ని, గుఱ్ఱం ఆకారంలో వచ్చిన కేసి అనే రాక్షసుణ్ణి గోపబాలకుడి రూపంలోలో వచ్చిన వ్యోమాసురుడనేవాణ్ని చంపివేసి యాదవులనూ, గోగణాలనూ కాపాడాడు.

## కంసుని పన్నాగం

రామకృష్ణులు దైవాంశ సంభూతులన్న నమ్మకం దేశ ప్రజలలో నానాటికీ ఎక్కువైంది. వారి మహిమలు గురించి జనం అదేపనిగా చెప్పుకుంటు న్నారు. ఇదంతా వింటున్న కంసుడికి దిక్కు తోచలేదు. తాను పంపిన బల వంతులైన రాక్షసులు కూడా హతులు కావడంతో కంసుడికి భయం పుట్టింది.

ఇలా ఉంటగా నారదుడు వచ్చి దేవకి అష్టమగర్భాన కృష్ణుడు యశోదకు కూతురుపుట్టగా ఆ పిల్లలిద్దరినీ మార్చివేసిన విషయం, కంసుడికి చెప్పాడు. అలాగే బలరాముడు మొదట దేవకి గర్భస్థుడనీ, తరవాత రోహిణికి కుమారుడై నాడని తెలియజేశాడు వారే పూతన మొదలైన రాక్షసులను సంహారించారనీ, వారివల్లనే కీడు మూడనున్నదనీ స్పష్టం చేయడంతో కంసుడికి కంపరం పుట్టింది. దేవకీ వసుదేవులను మళ్ళీ చెరసాలలో పెట్టాడు.

అప్పుడు అతను ఒక కుట్రపన్నాడు. మధురలో ధనుర్యాగం ఏర్పాటు చేశాడు. వినోదాలు, వీరకృత్యాలు జరిగే ఆ ఉత్సవాలకు బలరామ కృష్ణులను ఆహ్వానించి, వెంట తీసుకరావలసినదని అక్రూరుణ్ని వ్రేపల్లెకు పంపాడు. బలరామ కృష్ణులు మధురకు రాగానే, వాళ్ళను ఏదోవిధంగా అంత మొందించాలని కంసుడి పన్నాగం.

అక్రూరుడు హరిభక్తుడు. బలరామకృష్ణులు అవతార పురుషులని అతని నమ్మకం, కంసుడి కుట్ర ఫలించదని కూడా అతనికి తెలుసు. అక్రూరుడు వెళ్ళి రామకృష్ణులను మధురకు తీసుకుని వచ్చాడు.

## కంస వధ

మధురానగరంలో రామకృష్ణులు ఎన్నో అద్భుతాలుచేశారు. వారి అంద చందాలు, వారి తేజస్సు చూసి ప్రజలు విస్మయం చెందారు. స్త్రీలూ పురుషులూ బాలలూ వృద్ధులూ అందరూ వారిని అచేతనంగా చూస్తూ తమ జన్మలు ధన్యమైనట్లు భావించుకున్నారు. కంసరాజుకు బట్టలు ఉతికే చాకలి, తమకు బట్టలు ఇవ్వ

డానికి నిరాకరించగా కృష్ణుడు అతన్ని చంపివేశాడు. అతని దగ్గరున్న రాజ దుస్తులు ధరించారు రామకృష్ణులు. భక్తుడైన ఒక సాలెవాడు వారికి రకరకాల అలంకారాలు చేశాడు. అలాగే పూలమాలలు కట్టే సుదాముడు కూడా హరి భక్తుడు. అతను రామకృష్ణులకు చక్కని పూలమాలలు సమర్పించగా వారు సంతోషించి, అతనికి వరాలు ఇచ్చారు.

కంసుడి అంతఃపుర దాసీలలో కుబ్జ ఒకతె. ఆమె కురూపి. శరీరం వంకరలు తిరిగి చూడడానికి చాలా అసహ్యంగా కనిపిస్తుంది. కంసుడికి గంధం మొదలైన వేపనాలు, పరిమళద్రవ్యాలు తయారు చేసి తీసుకునిపోవడం ఆమె పని. ఆమె రామకృష్ణులకు మంచి మంచి మైపూతలు సమర్పించింది. భక్తితో వారిని పూజించింది. అప్పుడు కృష్ణుడు కుబ్జ భక్తికి మెచ్చి, ఆదరంతో ఆమె శరీరాన్ని స్పృశించాడు. అంతే, కృష్ణుడి అనుగ్రహం వలన తక్షణమే కుబ్జకు కురూపత్వం పోయింది. అందమైన రూపం వచ్చింది. అప్పుడామె కృష్ణుని అనేక విధాల స్తుతించి ధన్యురాలైంది.

ధనుర్యాగం ప్రారంభం కాకముందే తమ ప్రతాపం కంసుడికి చూపా లనుకున్నారు రామకృష్ణులు. ధనుర్యాగం ఏర్పాటు చేసిన ప్రదేశంలో ఆయుధ శాల వుంది. అక్కడ భటులు కాపలా ఉన్నారు. రామకృష్ణులు ఆయుధశాలలో ప్రవేశించారు. అక్కడ ఎవరూ ఎత్తలేని ఒక పెద్ద కోదండాన్ని కృష్ణుడు అవ లీలలా ఎత్తి విరిచివేశాడు. భటులు కోపంతో ఎదిరించగా రామకృష్ణులు వారితో యుద్ధంచేసి చంపివేశారు. కంసుడికి ఆ సంగతి తెలిసి భయంతో వణికి పోయాడు.

మధురలో అనేక అపశకునాలు పొడగట్టాయి. ఆరాత్రి కంసుడికి పీడకలలు వచ్చాయి. చావు దగ్గరికి వచ్చినట్లు సూచనలు కనిపించాయి అతనికి. అయినా మరునాడు జరిగే మల్లయుద్ధ ప్రదర్శనలో తన ఆస్థానంలోని మల్ల యోధులు చాణూరుడు, ముష్టికుడు అనేవారు రామకృష్ణులను చంపి తీరుతారని ఆశ పెట్టుకున్నాడు. అందుకు ఏర్పాట్లన్నీ పూర్తి చేయించాడు.



తెల్లవారింది. మల్లక్రీడా మహోత్సవం మొదలైంది. రామకృష్ణులు రంగానికి వచ్చారు. రంగద్వారం వద్ద కొండలాంటి మదపుటేనుగు ఉంది. దాని పేరు కువలయా పీడం. కంసుడి ఆదేశానుసారం, ఆ మత్తగజాన్ని రామ కృష్ణులపై పురికొలిపాడు మావటివాడు. అది దిక్కులు పిక్కటిల్లేటట్లు ఘీంక రిస్తూ కృష్ణుడిపైకివచ్చి తొండంతో పట్టుకోబోయింది. అయితే కృష్ణుడు తప్పిం

చుకుని మదగజాన్ని క్రింద పడత్రోశాడు. సింహకిశోరంలా దానిపైకి ఉరికి దంతం పెరికివేశాడు. ఆ కోరతో ఏనుగు కుంభస్థలాన్ని చీల్చివేశాడు. మత్త గజం ఘీంకరిస్తూ విలవిల తన్నుకుని ప్రాణాలు విడిచింది, తరవాత మావటి వాణ్ణికూడా చంపివేశాడు కృష్ణుడు.




అప్పుడు కంసుడు భయంతో వణికిపోయాడు. తరవాత చాణూర ముష్టికులతో రామకృష్ణులు మల్లయుద్ధం చేశారు. బాలకులైన రామకృష్ణులు, పర్వతాకారులైన మల్లయోధులు చాణూర ముష్టికులతో తలపడి చిత్ర విచిత్రంగా యుద్ధంచేసి, చంపివేశారు.

అది కళ్ళారా చూస్తున్న ప్రజలు ఎక్కడలేని ఆశ్చర్యంలో మునిగి పోయారు. కంసుడి గుండెలు తల్లడిల్లాయి. "రామకృష్ణులను పట్టుకోండి. చుట్టుముట్టి సంహరించండి" అని వెర్రిగా కేకలు పెట్టాడు. కాని కంసుడి అను




చరులు రామకృష్ణుల దగ్గరికి రావడానికి సాహసించలేకపోయారు. కంసుణ్ని ధిక్కరించడానికి వెరచి కొందరు యోధులు మాత్రం రామకృష్ణులను చుట్టుముట్ట డానికి ప్రయత్నించారు. ఇక ఉపేక్షిస్తే లాభంలేదని కృష్ణుడు సింహాసనంపై

ఉన్న మేనమామ కంసుడి పైకి ఉరికేడు. కంసుడు తత్తర పాటుతో ఖడ్గం తీసుకుని కృష్ణున్ని చంపాలని చూశాడు. కాని అతని ప్రయత్నం వ్యర్థమయింది. ఉగ్రమయిన సర్పాన్ని గరుత్మంతుడు ఒడిసి పట్టునట్లు కంసుడ్ని, కృష్ణుడు పట్టుకుని సింహాసనం పై నుండి క్రింద పడవేసి, పిడిగ్రుద్దులలో అతని మర్మ స్థానాలను గుల్ల చేసి చంపివేశాడు. అప్పుడు దేవదుందుభులు మ్రోగాయి. ఇంద్రాది దేవతలు శ్రీ కృష్ణున్ని కీర్తించారు.

కంసుడి చావుతో తక్కిన యోధులు ప్రాణ భీతితో పారిపోయారు. కంసుడి తమ్ములు ఎనిమిది మంది, రామకృష్ణుల పైకి రాగా, బలరాముడు వారందరిని యమపురికి పంపాడు.

తరువాత కృష్ణుడు ఉగ్రసేనున్ని చెర నుండి విడిపించి, తిరిగి అతనికి రాజ్యం అప్పగించాడు. అలాగే దేవకీ వసుదేవులను బంధ విముక్తులను కావించాడు. రామకృష్ణులు, తమ తల్లిదండ్రుల పాదాలపై మోకరిల్లారు. తమ కుమాళ్ళను లేవనెత్తి, కౌగలించుకుని అంతులేని ఆనందాన్ని పొందారు. దేవకీ వసుదేవులు.

## గురుదక్షిణ

పురోహితుడైన గర్గాచార్యులను పిలిపించి శాస్త్రోక్తంగా రామకృష్ణులకు ఉపనయం చేయించాడు వసుదేవుడు. మహానుభావులైన రామకృష్ణులు నిజానికి గురువు వద్ద విద్య నేర్చుకోవలసిన పనిలేదు. అయినా వారు లోకాచారాన్ని పాటించారు. సాందీపుడనే విద్వాంసుడి దగ్గర సకల విద్యలూ

నేర్చుకున్నారు. విద్యాభ్యాసం పూర్తి అయిన తరువాత గురుదక్షిణ సమర్పించే సమయం వచ్చింది. చనిపోయిన తన కుమారుణ్ని తెచ్చి యివ్వమని అడిగాడు సాందీపుడు. అలాగేనన్నారు రామకృష్ణులు.



సాందీపుడి కుమారుడు సముద్ర స్నానానికి వెళ్ళి ప్రభాస తీర్థం వద్ద స్నానం చేస్తూ నీళ్ళలో మునిగిపోయాడు. పంచజనుడనే దానవుడు మ్రింగాడు ఆ బాలుణ్ని. రామకృష్ణులు అక్కడికి వెళ్ళి నీళ్ళలో మునిగి, లోపల దాగి ఉన్న



పంచజనున్ని చంపి, వాడి పొట్టలో వెదుకగా, గురుపుత్రుడు కనిపించలేదు. అప్పుడు వారు యమలోకానికి వెళ్ళగా, యముడు సాందీపుడి కుమారున్ని బ్రతికించి రామకృష్ణులకు అప్పగించాడు. పిమ్మట వారు గురు పుత్రుని తెచ్చి, సాందీపుడికి గురుదక్షిణగా సమర్పించి, గురువర్యుల ఋణం తీర్చుకున్నారు. దానవుడు పంచ జనున్ని చంపినప్పుడు అతని దేహంతో పాటు పుట్టిన శంఖాన్ని తీసుకున్నాడు కృష్ణుడు. అదే కృష్ణుడి దివ్య శంఖం పాంచజన్యం.

## ద్వారకానగర నిర్మాణం

ఆ కాలంలో మగధ దేశానికి అధిపతి జరాసందుడు. అతను మహా బలవంతుడు కంసుడికి పిల్లనిచ్చిన మామ అతను. కంసున్ని చంపినందుకు జరాసంధ్రుడు కృష్ణుడి మీద యాదవుల మీద పగ బట్టాడు. పెద్ద సైన్యంతో మధుర పై దండెత్తి వచ్చాడు. అప్పుడు రామకృష్ణులు జరాసంధున్ని ఎదిరించారు. పెద్ద యుద్ధం జరిగింది. జరాసంధుడు ఓడిపోయి పారిపోయాడు. అతను ఎన్నడూ ఓటమి ఎరగడు. ఇప్పుడిలా జరిగినందుకు అవమానంతో క్రుంగి పోయాడు. అయినా నిరాశ చెందక, మళ్ళీ బలాన్ని సమకూర్చుకుని మధురను ముట్టడించాడు, కాని ఈ సారి కూడా రామకృష్ణుల చేతుల్లో అతనికి పరాజయమే సంభవించింది. అయినా జరాసందుడు పట్టుదలతో ఆ విధంగా పదిహేడు సార్లు మధురపై దండెత్తాడు. ప్రతీసారి అతనికి పరాజయమే ఎదురైంది.

ఇలా ఉండగా కాలయవకుడనేవాడు కృష్ణుడితో విరోధం పెట్టుకుని పెద్ద మ్లేచ్ఛ సైన్యంతో ఆకస్మికంగా మధురానగరం పై వచ్చి పడ్డాడు. అదికని



పెట్టి అదే సమయం అనుకుని జరాసంధుడు కూడా పద్దెనిమిదవ సారి దండెత్తి రావడానికి సన్నద్ధుడైనాడు. ఆ విధంగా రెండు వైపుల నుంచి శత్రు ప్రమాదం ముంచుకుని రావడంతో కృష్ణుడు ఆలోచించి, అప్పటికప్పుడు విష్ణుకర్మ సహాయంతో, సముద్ర మధ్యంలో శత్రువులు ప్రవేశించడానికి వీలు లేని ఒక దుర్గాన్ని నిర్మింప జేశాడు. మధురానగర ప్రజలనూ, తదితర యాదవులనూ అక్కడికి చేర్చాడు. అనేక గోపురాలు, ద్వారాలతో వెలుగొందుతున్న ఆ పట్టణానికి ద్వారకా అని పెట్టాడు. ఆ నగరానికి బలరాముణ్ని రక్షగా ఉంచి తరువాత తలా ఒక్కడూ మధురను విడిచి పెట్టు పారిపోతున్నట్లు నటించారు. ఉపాయంగా తనను చంపడానికే కృష్ణుడు అలా చేస్తున్నాడని కాలయువకుడు తెలుసుకోలేక, తనతో యుద్ధం చేయడానికి జడిసి పారిపోతున్నాడనుకొని కాలయువకుడు కృష్ణుడి వెంటబడి తరమడం మొదలు పెట్టాడు.

కృష్ణుడు అలా వెళ్ళి వెళ్ళి ఒక గుహలో దూరి మాయమైనాడు. కాలయువకుడు కృష్ణుడి కోసం ఆ గుహలో ప్రవేశించి, అక్కడ ఎంతో కాలంగా యోగనిద్రలో మునిగి ఉన్న ముచింకుడనే మహాత్ముని చూశాడు. కృష్ణుడే మాయవేషం వేసుకుని పడుకున్నాడనుకొని కాలయువకుడు, తన కాలితో ఆ మహాత్ముని తన్నాడు. అప్పుడు ముచికుందుడు మేల్కొని, కళ్ళు తెరచి కాలయువకుని చుర చుర చూసే సరికి, ఆ చూపులకు కాలి బూడిద అయిపోయాడు కాలయువకుడు. ఆ విధంగా యుక్తితో కాలయవకుని సంహరించి కృష్ణుడు ద్వారకకు తిరిగి వచ్చాడు. అప్పటి నుండి ద్వారకాలోనే ఉండి యాదవులకు ప్రభువై పరిపాలనను సాగిస్తూ వచ్చాడు.

# రుక్మిణీ కళ్యాణం

విదర్భ దేశపు రాజు భీష్మకుడు. అతని రాజధాని కుండిన నగరం భీష్మకుడికి రుక్మి, రుక్మరథుడు, రుక్మబాహుడు, రుక్మకేశుడు, రుక్మమలి అనే కొడుకులు, రుక్మిణి అనే కూతురు ఉన్నారు. రుక్మిణి అందరికన్నా చిన్నది. ఆమె చాలా చక్కనిది. బుద్ధిమంతురాలు. సకల విద్యలూ నేర్చినది. లక్ష్మీదేవి అంశతో పుట్టడం వలన చిన్నతనం నుంచీ విష్ణుమూర్తి అంటే భక్తి ఆమెకు. కృష్ణుడి మహిమలను గురించి ఆమె విన్నది. అతనే భర్త కావాలని వేడుకుంటూ ఎల్లప్పుడూ కృష్ణుణ్నే ధ్యానిస్తూ ఉంటుంది. అయితే ఆమె అన్నలు రుక్మి మొదలైన వారికి అది ఇష్టం లేదు. కృష్ణుడంటే వారికి గిట్టదు. ముఖ్యంగా పెద్దన్న రుక్మి సరసుడు కాదు. శిశుపాలుడు మొదలైన దుష్టులతో అతనికి స్నేహం. చేదిదేశపు రాజు శిశుపాలుడుకే రుక్మిణిని ఇచ్చి పెళ్ళి చేయాలని అతని ఉద్దేశ్యం. భీష్మక రాజుకు తన కూతుర్ని కృష్ణుడికే ఇచ్చి పెళ్ళి చేయాలని ఉన్నప్పటికీ, కొడుకు రుక్మి మాట కాదనే ధైర్యం లేదు.

కృష్ణుడు కూడా రుక్మిణి అందచందాల గురించి, గుణ గణాలను గురించి చెప్పుకోగా విన్నాడు. ఆమెనే అర్ధాంగిగా చేసుకోవాలని సంకల్పించుకున్నాడు. అయితే రుక్మిణిని శిశుపాలుడికి ఇచ్చి పెళ్ళి చేయాలని నిశ్చయించుకుని ముహూర్తం పెట్టించాడు రుక్మి. పెళ్ళి ఏర్పాట్లు చకా చకా జరిగిపోతున్నాయి. అప్పుడు రుక్మిణి, తనకి ఇష్టుడు భగవద్భక్తుడు అయిన ఒక బ్రాహ్మణ్ని పిలిచి, అతని ద్వారా కృష్ణుడికి రహస్యంగా సందేశం పంపింది.

తన ఇష్టానికి వ్యతిరేకంగా శిశుపాలుడికిచ్చి పెళ్ళి చేయబోతున్నారని, సమయం మించిపోకముందే, వచ్చి రాక్షస విధానంలో తనను బలత్కారంగా తీసుకుని పోయి పెళ్ళాడవలసినదని వర్తమానం పంపింది.

బ్రాహ్మడు ద్వారకకు వెళ్ళి కృష్ణుడికి రుక్మిణి సందేశం వినిపించాడు. కృష్ణుడు సంతోషించి సేనలతో బయలు దేరి మండిన నగరానికి వచ్చాడు. పెళ్ళినాడు రుక్మిణి, అలంకారం చేసుకుని, గౌరీపూజకై ఊరి వెలుపలగల దేవి ఆలయానికి వెళ్ళితిరిగి వస్తున్న సమయంలో కృష్ణుడు వచ్చి ఆమెను రథం పై ఎక్కించుకుని వెళ్ళసాగాడు. అప్పుడు పెళ్ళి కుమారుడుగా వచ్చిన శిశుపాలుడు, అతని స్నేహితులైన ఇతర రాజులు, రుక్మిణి అన్న రుక్మి, కృష్ణుడు చేసిన ఆగడం చూసి అడ్డు తగిలారు. పెద్ద యుద్ధం జరిగింది. కృష్ణుడు శిశుపాలాదులను ఓడించాడు. రుక్మిని కూడా విరథుణ్ని చేసి బందీగా పట్టుకున్నాడు. అయితే రుక్మిణి కోరికపై అతన్ని చంపకుండా, కత్తితో అతని తల, మీసాలు గొరిగి అవమానించి వదిలి పెట్టాడు. ఆ విధంగా కృష్ణుడు రుక్మిణిని తీసుకుని ద్వారకకు వెళ్ళాడు. అక్కడ కృష్ణుడికి రుక్మిణికి వైభోగంగా వివాహం జరిగింది.

# సత్యభామ స్యమంతక మణి

ద్వారకలో ఉండే ప్రముఖులలో సత్రాజిత్తు ఒకడు. అతను సూర్య భగవానుడి భక్తుడు. సూర్యుడు అతనికి స్యమంతకం అనే దివ్యమైన మణి ఇచ్చాడు. ఆ మణిని మెడలో ధరించి సత్రాజిత్తు రెండవ సూర్యుడిలా వెలిగి పోతూ ఉండేవాడు. ఆ మణి ఉన్నచోట ఎలాంటి అరిష్టాలూ సంభవించవు.

అంతేకాకుండా అది రోజూ నూరు బారువుల బంగారం ఇస్తూ ఉంటుంది. సత్రాజిత్తు కుమార్తె సత్యభామ, ఆమె చక్కని దేకాక అన్ని విద్యలూ నేర్చిన జాణ. స్యమంతమణిని తనకు ఇమ్మని కృష్ణుడు ఒక మాటు సత్రాజిత్తును అడిగాడు. కాని అతను ఇవ్వనన్నాడు.

ఇలా ఉండగా సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుడు ఒకనాడు స్యమంతక మణిని మెడలో ధరించి వేటకు వెళ్ళాడు. అప్పుడొక సింహం ప్రసేనుణ్ని చంపి, స్యమంతక మణిని ఎత్తుకుని పోయింది. భల్లూకరాజు జాంబవంతుడు ఆ సింహాన్ని చంపి స్యమంతక మణిని అపహరించాడని సత్రాజిత్తు నింద వేశాడు. అన్యాయంగా తన పై నింద వచ్చినందుకు కృష్ణుడు వెంటనే అడవికి వెళ్ళి అక్కడ అడుగు జాడలను కనిపెట్టి జాంబవంతుడి గుహలోకి వెళ్ళాడు. స్యమంతక మణి కనిపించింది. ఆ మణిని తీసుకోవాలని కృష్ణుడు ప్రయత్నిస్తుండగా, జాంబవంతుడు వచ్చి కృష్ణుడితో తలపడ్డాడు. కృష్ణుడికీ, జాంబవంతుడికీ ఇరవై ఎనిమిది రోజులు ఘోరంగా యుద్ధం జరిగింది. జాంబవంతుడి బలం క్షీణించింది. తనను ఓడించగలవాడు విష్ణుమూర్తి తప్ప మరెవరూ ఉండరని, పూర్వం శ్రీ రామచంద్రమూర్తి ఇప్పుడు కృష్ణుడిగా అవతరించాడని జాంబవంతుడు తెలుసుకుని, తనను మన్నించమని వేడుకొన్నాడు. స్యమంతక మణితో పాటు తన కుమార్తె జాంబవతిని కూడా కృష్ణుడికి సమర్పించాడు.

కృష్ణుడు మణిని, జాంబవతిని తీసుకుని ద్వారకకు తిరిగివచ్చి, మణిని సత్రాజిత్తుకు అప్పగించి, తన పై నిష్కారణంగా వచ్చిన అపనింద తొలగించుకున్నాడు. అన్యాయంగా కృష్ణుడి పై నింద వేసినందుకు సత్రాజిత్తు నొచ్చుకుని,

స్యమంతకమణిని, తన కుమార్తె అయిన సత్యభామను స్వీకరించమని కృష్ణుణ్ని వేడుకున్నాడు. కృష్ణుడు జాంబవతిని, సత్యభామను కూడా పెళ్ళాడాడు. తరువాత కృష్ణుడు కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ అనే మరి అయిదుగురు కన్యలను కూడా వివాహమాడాడు. ఆ విధంగా కృష్ణుడికి ఎనిమిది భార్యలైనారు. అందరిలోనూ రుక్మిణి పట్ట మహిషి అయింది. కొంత కాలానికి కృష్ణుడికి రుక్మిణి యందు ప్రద్యుమ్నుడనే కుమారుడు జన్మించాడు. శివుడి మూడో కంటి మంటలో దగ్ధమయి పోయిన మన్మధుడే ప్రద్యుమ్నుడు. అతను తన మేనమామ కూతురు రుక్మవతిని పెళ్ళాడాడు. ప్రద్యుమ్నుడికీ, రుక్మవతికి పుట్టినవాడే అనిరుద్ధుడు.

## ఉషా పరిణయం

బలిచక్రవర్తి కుమారుడు బాణుడు. అతను మహా బలవంతుడు. శివభక్తుడు. శివుణ్ని మెప్పించి, తన నగరమైన శోణపురం ద్వారం వద్ద కాపలా ఉండేటట్లు చేసుకున్నాడు. బాణాసూరుడి కుమార్తె ఉష. ఆమె చక్కని చుక్క. ఒకనాడు అనిరుద్ధుడు ఆమెకు కలలో కనిపించాడు. అప్పటి నుంచి ఉష అనిరుద్ధుని ప్రేమిస్తూ వచ్చింది. చెలికత్తె అయిన చిత్రలేఖ, ఓ రాత్రివేళ, యోగబలంతో ఆకాశమార్గాన ద్వారకకు వెళ్ళి నిద్రలో ఉన్న అనిరుద్ధుణ్ని తెచ్చి,ఉషాకన్య దగ్గర చేర్చింది. వారిద్దరూ ప్రేమతో రహస్యంగా గడుపుతు

న్నారు. అయితే ఈ విషయం బాణుడికి తెలిసి పోయింది. అతను అనిరుద్ధుణ్ని నాగపాశాలతో బంధించి ఉంచాడు.

ఇలా ఉంటగా అక్కడ ద్వారకలో అనిరుద్ధుడి జాడ తెలియక అంతా ఆందోళన చెందారు. తరువాత నారదుడి వల్ల అనిరుద్ధుడి సంగతి తెలుసుకుని కృష్ణుడు యాదవ వీరులతో శోణపురం పై దండెత్తి వచ్చాడు. బాణాసురుడి బంటుగా ఉన్న శంకరుడికి, కృష్ణుడికి గొప్ప యుద్ధం జరిగింది. కృష్ణుడు తన మాయతో శివుణ్ని మోహంలో ముంచివేసి, బాణాసురుడ్ని ఓడించాడు. శంకరుడి ప్రార్థన మన్నించి బాణుడి వేయి చేతులూ నరికివేసి, చంపకుండా విడిచి పెట్టాడు. అప్పుడు బాణుడు, అనిరుద్ధుణ్ని బంధ విముక్తుణ్ని కావించి, ఉషను అతనికిచ్చి వైభవంగా వివాహం చేశాడు.

# నరకాసుర వధ

పూర్వం విష్ణుమూర్తి వరహావతారం ఎత్తినప్పుడు, భూదేవి వలన అతనికి ఒక కుమారుడు పుట్టాడు. వాడే నరకుడు. ప్రాగ్జ్యోతిషపురం అతని రాజధాని. నరకుడు రాక్షస ప్రవృత్తి కలవాడై, దివ్యాస్త్రాలు, శస్త్రాలు సంపాదించి, మహాబలాఢ్యుడై లోకాలను పీడించడం మొదలు పెట్టాడు. భూదేవి కూడా తన పుత్రుడి దుండగాలు భరించలేకపోయింది. నరకుడి నగరం చుట్టూ గిరిదుర్గం, జలదుర్గం, అగ్నిదుర్గం, వాయుదుర్గం- అనే నాలుగు దుర్గాలు

న్నాయి. అతన్ని జయించడం ఎవరికీ చేతకాలేదు. వరుణదేవుడి గొడుకు, అదితిదేవి కర్ణకుండలాలు, దేవతల నివాసమైన మేరుపర్వతం లోని మణిపర్వతం, వైజయంతీ వనమాలిక, మొదలైనవి స్వాధీనం చేసుకున్నాడు నరకుడు. ఇంద్రుడు వచ్చి నరకుడు పెడుతున్న బాధలన్నీ చెప్పుకుని రక్షించమని వేడుకున్నాడు కృష్ణుణ్ని.

అప్పుడు కృష్ణుడు గరుడ వాహనం ఎక్కి నరకుడి పై యుద్ధానికి వెళ్ళాడు. సత్యభామ కూడా కృష్ణుడితో పాటు వెళ్ళింది. నరకుడుసుప్రతీకం అనే ఏనుగు ఎక్కి పెద్ద సైన్యంతో కృష్ణుణ్ని ఎదిరించాడు. కృష్ణుడికీ నరకుడికీ భయంకరమైన యుద్ధం జరిగింది. ఈ పోరాటంలో సత్యభామ కూడా గొప్ప సాహసాన్ని ప్రదర్శిస్తూ కృష్ణుడికి సహాయపడింది. ధనస్సు పట్టుకుని నరకాసురుడితో పోరాడింది. చివరకు కృష్ణుడు తన చక్రాయుధంతో నరకుణ్ని వధించి, సమస్త లోకాలకూ ఆనందం కలిగించాడు. నరకుడు అపహరించుకుని పోయిన అదితిదేవి కుండలాలు తిరిగి ఆమెకు అప్పగించాడు. ఇంద్రుడు కృష్ణుణ్ని భక్తితో పూజలు సత్కారాలు చేశారు. దేవలోకంలోని నందనవనంలో పారిజాత వృక్షాన్ని సత్యభామ కోరిక పై తెచ్చి భూలోకంలో ఆమె భవనంలో నాటించాడు కృష్ణుడు. నరకుడి చెఱలో ఉన్న పదహారు వేల మంది రాజకన్యలను విడిపించి వారిని పెండ్లాడాడు కృష్ణుడు.



# మరొక వాసుదేవుడు

కరూశ దేశాన్ని పాలిస్తున్న రాజు పౌండ్రకుడు. విష్ణుమూర్తి లాగానే అతనికి శంఖం, చక్రం మొదలైన చిహ్నాలున్నాయి. కొందరు దుష్టులు అతని చుట్టూ చేరి అతనే అసలు కృష్ణుడని ప్రచారం చేస్తూ వచ్చారు. అది నిజమేననుకుని పౌండ్రకుడు గర్వించాడు. పౌండ్రక వాసుదేవుడని పేరు పెట్టుకున్నాడు. ద్వారకకు ఒక దూతను పంపాడు. "కృష్ణా! నీవు నా పేరు పెట్టుకుని తిరుగుతున్నావు. అసలు వాసుదేవుడను నేనే! నీవు శంఖ చక్రాది చిహ్నాలు తీసివేసి, నేనే కృష్ణుడనని అంగీకరించు లేకపోతే యుద్ధంలో నిన్ను సంహరిస్తాను." అని వర్తమానం పంపాడు.

అది విని కృష్ణుడు నవ్వుకున్నాడు. "పౌండ్రకా అసలు వాసుదేవుడెవరో యుద్ధభూమిలో తేల్చుకుందాం" అని సమాధానం పంపాడు.

పౌండ్రదేవునికి ఆగ్రహం వచ్చింది. తన స్నేహితుడైన కాశరాజు సహాయంతో పెద్ద సైన్యాన్ని తీసుకుని కృష్ణుడి పైకి యుద్ధానికి వచ్చాడు. కృష్ణుడు పౌండ్రకుని అతని స్నేహితుడైన కాశరాజును సునాయాసంగా ఓడించి. సంహరించాడు. ఆ విధంగా దుష్టులను శిక్షించాడు కృష్ణుడు.

# జరాసంధుడి వధ

పాండవుల తల్లి కుంతీదేవి కృష్ణుడికి మేనత్త. అంతేకాక కృష్ణుడి చెల్లెలు సుభద్రను అర్జునుడు పెళ్ళాడాడు. ఆ విధంగా బంధుత్వానికి తోడు,



మొదటి నుంచీ దుర్మార్గులైన కౌరవులు అన్యాయం చేయడం వల్ల పాండవులు అరణ్యాల పాలై అష్ట కష్టాలు అనుభవించడం, తనకు భక్తులై, ఎప్పుడూ తన సలహాలను. సహాయాన్ని అపేక్షిస్తూ ఉండడం వీటి మూలంగా పాండవులంటే కృష్ణుడికి ఎక్కడలేని ప్రేమ అభిమానమూను.

ఇంద్రప్రస్థపురంలో ధర్మరాజు రాజసూయాగం తలపెట్టాడు.

దిగ్విజయ యాత్ర చేసి, రాజులందరినీ జయిస్తే కాని ఆ యాగం చేయడానికి వీలు లేదు. కనుక ధర్మరాజు కృష్ణుడి సహాయం కోరాడు. ధర్మరాజు తమ్ములు భీమార్జున నకుల సహదేవులు నాలుగు దిక్కులకూ వెళ్ళి రాజులను జయించి రాగలరు. కాని మగధ దేశాధిపతి జరాసంధుణ్ని జయించడం కష్టం. జరాసంధుడి జన్మ వృత్తాంతం విచిత్ర మైనది.

మగధపతికి బృహద్రధుకి ఇద్దరు భార్యలు. చాలా కాలం వరకూ వారికి సంతానం లేదు. చండ కౌశికురనే ముని, బృహద్రధుడి భక్తికి మెచ్చి బిడ్డ పుడతాడని చెప్పి ఒక దివ్య ఫలం ఇచ్చాడు. ఆ పండు కోసి చెరి సగం తన భార్యలకు ఇచ్చాడు బృహధుడు. భార్యలు గర్భవతులై కొన్నాళ్ళకు శిశువులను కన్నారు. అయితే బిడ్డను నడిమకు చీల్చినట్లుగా, ఒక కన్ను, ఒక కాలు, ఒక చెయ్యి, సగం పొట్ట, సగం తల ఉన్న ఒక్కొక్క బిడ్డను ప్రసవించారు వారు. వికృత రూపాలతో పుట్టిన బిడ్డలను చూసి భయపడి రాణులు, తమ దాసీల చేత తోట వెలుపల పారేయించారు.



కోట వద్ద రాత్రి వేళ తిరుగుతున్న జర అనే రాక్షసి, ఆ ఖండాలను చూసి ఆహారం దొరికింది కదా అని సంతోషించింది. ఆ రెండు ఖండాలను ఒకటిగా చేసి తీసుకునే సరికి, వెంటనే ఒక బాలుడి ఆకారం ఏర్పడి ఆ బాలుడు పెద్దగా ఏడవడం మొదలు పెట్టాడు. ఆ ఏడుపు విని దాసీలు బృహద్రథుడికి తెలియజేయగా, అతను వచ్చి శిశువు తన కుమారుడేనని గ్రహించి తీసుకున్నాడు. జర చేత సంధింప బడిన వాడు కావడం వల్ల జరాసంధుడని పేరు పెట్టాడు.

జరాసంధుడు పెరిగి పెద్దవాడై మహా బలవంతుడైనాడు. అతని రాజధాని అయిన గిరివ్రజం చుట్టూ పెట్టని కోటగోడ వలె అనేక పర్వతాలు ఉన్నాయి. నగరం వెలుపల ఒక కొండ మీద రెండు భేరీ వాయిద్యాలు ఏర్పాటు చేయించాడు జరాసంధుడు. శత్రువులు నగరంలో అడుగు పెట్టగానే భేరులు వాటంతట అవే మ్రోగుతాయి.

తనకు శత్రువైన జరాసంధుణ్ని చంపగలవాడు భీముడని తెలుసుకుని కృష్ణుడు, భీమార్జునులను వెంటబెట్టుకుని బ్రాహ్మణ వేషాలతో గిరివ్రజానికి వెళ్ళాడు. భేరులను పగులగొట్టి రహస్య మార్గాన నగరంలో ప్రవేశించారు ముగ్గురూ.

వారు నిజంగానే బ్రాహ్మలనుకొని జరాసంధుడు వారిని పూజించి ఏం కావాలని అడిగాడు. అప్పుడు తాము ఎవరైందీ తెలిపి యుద్ధం కావాలని కోరాడు కృష్ణుడు. మోసం తెలుసుకుని జరాసంధుడు తనకు జోడీగా ఉన్న భీమసేనుడితో యుద్ధానికి సమ్మతించాడు. భీమ, జరాసంధులకు పెద్ద యుద్ధం జరిగింది. ఒకరి



నౌకరు తీసిపోకుండా పోరాడారు. చివరకు జరాసంధుణ్ని పడవేసి అతని శరీరాన్ని రెండుగా చీల్చి విసిరివేశాడు. కాని ఆ రెండు ఖండాలూ కలుసుకుని జరాసంధుడు తిరిగి బ్రతికి వచ్చి భీముడితో పోరాడడం మొదలు పెట్టాడు. ఇలా కొన్నిసార్లు జరిగింది. అప్పుడు కృష్ణుడు, జరాసంధుడి జన్మ రహస్యం తెలిసిన వాడు కనుక, భీముడు చూస్తుండగ ఒక పుల్ల తీసుకుని దాన్ని నడిమకి విరిచి ఆ ముక్కలు ఒకే వైపు కాకుండా అస్తవ్యస్తంగా పారవేశాడు. అది గ్రహించి భీముడు, జరాసంధుణ్ని క్రింద పడవేసి, రెండుగా అతని శరీరాన్ని చీల్చి, రెండు ముక్కలను వ్యతిరేకంగా అటొకటి, ఇటొకటి పారవేయడంతో, జరాసంధుడు మరణించాడు.

ఆ విధంగా కృష్ణుడు, భీముడి చేత జరాసంధుణ్ని చంపించి, ధర్మరాజు రాజసూయాగం ఆటంకం లేకుండా నెరవేరేటట్లు చేశాడు.

# శిశుపాల వధ

ధర్మరాజు వైభవంగా రాజసూయగం చేశాడు. యాగం తరువాత, వచ్చినవారిని పూజించే సమయం వచ్చింది. మొదట ఎవరిని పూజించాలన్న ప్రశ్న వచ్చినప్పుడు అన్ని విధాల యోగ్యుడు, అవతార పురుషుడు అయిన కృష్ణుడికి ప్రథమ పూజ చేశాడు ధర్మరాజు. అది చూసి చేది దేశపు రాజు శిశుపాలుడు. కృష్ణుడు ప్రథమ పూజకు తగని వాడని అనేక విధాల దూషించాడు కృష్ణుణ్ని.

శిశుపాలుడి తల్లి సాత్వతి. కృష్ణుడికి మేనత్త. శిశుపాలుడు పుట్టి టప్పుడే నాలుగు చేతులూ, మూడు వ్రేళ్ళతో పుట్టాడు. ఆ వికృత రూపం చూసి అందరూ భయపడ్డారు. అయితే, ఆ బాలుణ్ని ఎవరు ఎత్తుకుంటే, అధికంగా ఉన్న అవయవాలు మాయమవుతాయో అతని చేతుల్లో, శిశుపాలుడికి చావు ఉన్నదని ఆకాశవాణి పలికింది. అందువల్ల ఇంటికి వచ్చిన వారందరికీ. శిశుపాలుణ్ని ఎత్తుకోడానికి ఇచ్చేది తల్లి. ఒకసారి కృష్ణుడు అక్కడికి వెళ్ళి పిల్లవాణ్ని ఎత్తుకున్నప్పుడు వాడి మూడో కన్ను, అధికంగా ఉన్న రెండు చేతులూ మాయమైనాయి. దాంతో కృష్ణుడి చేతుల్లో కుమారుడికి చావు ఉన్నదని తెలిసి, వాణ్ని కాపాడమని కోరింది. కృష్ణుణ్ని, సాత్వతి. నూరు తప్పుల వరకూ శిశుపాలుణ్ని మన్నిస్తానని కృష్ణుడు మాట ఇచ్చాడు. అప్పటి నుంచీ తన పట్ల శిశుపాలుడు చేస్తున్న అపచారాలను కృష్ణుడు లెక్క పెట్టుకుంటూనే ఉన్నాడు. ఇప్పుడు శిశుపాలుడు నిందించడంతో నూరు తప్పులు దాటినందున కృష్ణుడు వెంటనే చక్రాయుధంతో శిశుపాలుడి తల నరికి వేశాడు.

శిశుపాలుడి స్నేహితుడు సాల్వుడు. శిశుపాలుడి తమ్ముడు దంతవక్త్రుడు ఆగ్రహంతో యుద్ధానికి సిద్ధపడగా వారిని కూడా వధించాడు కృష్ణుడు.

## కుచేలోపాఖ్యానం

కుచేలుడనే బ్రాహ్మడున్నాడు. అతను కృష్ణుడి బాల్యస్నేహితుడు. కృష్ణుడితో కలిసి సాందీపుని వద్ద చదువుకున్నాడు. వేదవేదాంగాలూ అభ్యసించి

గొప్ప విద్వాంసుడైనాడు. అయితే అతను కటిక దరిద్రుడు. దారిద్ర్యానికి తోడు గంపెడు మంది పిల్లలు. సంసారాన్ని పోషించుకోలేక నానా బాధలు పడుతున్నాడు.

కుచేలుడి భార్య పరమ పతివ్రత. భర్తతో పాటు ఆమె కూడా అష్టకష్టాలు అనుభవిస్తున్నది. దరిద్రానికి ఆకలి ఎక్కువన్నట్లు పిల్లలు నకనకలాడిపోతుంటే, ఆమె ఏమీ చేయలేక, నిస్సహాయ స్థితిలో దుఃఖ పడుతూ ఉండేది. తినడానికి తిండి, కట్టడానికి బట్ట లేక కుచేలుని కుటుంబం దుర్భరమైన బాధలు అనిభవిస్తూ వచ్చింది. బియ్యపు నూకలకు నోచుకోక పిల్లలతో సహా పస్తులుండడం ఆ ఇంట్లో మామూలు అయిపోయింది.

పరిస్థితి ఇలా ఉండగా కుచేలుడి భార్య ఒకనాడు భర్త దగ్గర కూచుని 'స్వామీ! ఎన్నాళ్ళు మనకీ దారిద్యబాధ. పిల్లలను చూస్తే నా గుండె తరుక్కుపోతున్నది. దీనికేదో మార్గం ఆలోచించండి. సాక్షాత్తు లక్ష్మీనాధుడైన శ్రీ కృష్ణుడు మీ బాల్య స్నేహితుడు కదా! ఆయన దగ్గరికి పోయి మీరు ఎందుకు యాచించకూడదు.? ఆయన దీనవత్సలుడని అంటుంటారు అందరూ. ఆయన మనకు ఏదైనా సహాయం చేయకపోడు' అని కంట తడి పెట్టింది.

భార్యసలహా బాగున్నదనుకున్నాడు కుచేలుడు. ఈ నెపంతో అయినా భగవంతునిదర్శించ వచ్చుకదా అని సంబర పడ్డాడు. వెంటనే భార్యతో "అంతటి గొప్పవాడు చిన్ననాటి స్నేహితుడు అయిన శ్రీ కృష్ణుడి దగ్గరికి వట్టి చేతులతో

ఎలా వెళ్ళను? ఏదైనా కానుక తీసుకుని వెళ్ళటం ఉచితం. ఇంట్లో ఏదైనా ఉంటే ఇవ్వు" అన్నాడు.

పాపం, ఆ ఇల్లాలు ఏంచేస్తుంది? ఇంట్లో ఏమున్నది కనుక ఇవ్వడానికి? ఇరుగు పొరుగు బ్రాహ్మల ఇళ్ళకు వెళ్ళి నోరు తెరిచి అడిగింది. ఏదైనా పెట్టమని. వారు కాసిని అటుకులు పెట్టారు. అవి నాలుగి పిడికిళ్ళు అయినాయి. వాటిని ఒక చిరిగిన మాసిపోయిన గుడ్డముక్కలో మూట కట్టి కుచేలుడికి ఇచ్చింది ఆమె. అటుకులు మూట తీసుకుని కుచేలుడు ద్వారకకు బయలుదేరాడు. అయితే. ఆ పేద బ్రాహ్మడి మనస్సులో అనేక సందేహాలు పీడిస్తున్నాయి.

రెండవ వైకుంఠంలా ఉండే కృష్ణుడి మందిరంలో తాను ప్రవేశించటం ఎలా? వెడితే మాత్రం కృష్ణుడు దర్శనం ఇస్తాడా? అసలు ఆయనకు నేను జ్ఞాపకం ఉంటానా? ఇలా ఎన్నో అనుమానాలూ, భయాలూ మనస్సును కలత పెడుతుండగా కుచేలుడు ద్వారక చేరుకున్నాడు. కృష్ణుడు దివ్య భవనానికి వెళ్ళాడు. అక్కడ ఎవరూ అతన్ని అడ్డగించ లేదు. ఎన్నో ద్వారాలూ, మందిరాలూ దాటి రుక్మిణీదేవి కృష్ణుడితో ఉండే అంతఃపుర మందిరంలో ప్రవేశించాడు.

బాల్య సఖుడైన కుచేలుని అల్లంత దూరాన ఉండగానే చూశాడు కృష్ణుడు. వెంటనే ప్రియురాలి పాన్పు పైనుండి చివాలున లేచి వచ్చి, కుచేలుని గాఢంగా కౌగలించుకున్నాడు. ఆదరంతో తీసుకుని వెళ్ళి తన పాన్పు పై కూచోబెట్టాడు. బంగారు పళ్ళెరంలో ఆ బ్రాహ్మడి కాళ్ళు కడిగి నెత్తిన చల్లు

కున్నాడు. గంధ పుష్పాక్షలతో పూజించాడు. సకల మర్యాదలూ చేశాడు. కృష్ణుడి అభిప్రాయం గ్రహించి రుక్మిణీదేవి కుచేలుడికి వింజామరలు వీస్తూ పరిచర్యలు చేసింది.

కుచేలుడి ఆనందానికి అంతు లేదు. జగన్నాథు డైన శ్రీకృష్ణుడు తనలాంటి అభాగ్యుడికి ఇంత ఆదరంతో, ప్రేమతో గౌరవ మర్యాదలు చేస్తాడని అనుకోలేదు ఆ పేద బ్రాహ్మడు. అతని శరీరం ఆనందంతో పులక రించింది. తరువాత కృష్ణుడు, కుచేలుని తన ప్రక్కన కూచోబెట్టుకుని చేయి పట్టుకుని ఆదరంతో కుశల ప్రశ్నలడిగాడు. చిన్నప్పుడు చదువుకునే రోజుల్లో సంగతులు ఒకరి కొకరు గుర్తు చేసుకుని, ఇద్దరూ కొంత సేపు కబుర్లాడు కున్నారు.

తరువాత కృష్ణుడు "స్నేహితుడా ఇంత కాలానికి మనం కలుసు కున్నాం కదా! మీ ఇంటి నుంచి నా కోసం ఏం తెచ్చావు? భక్తితో ఇచ్చిన పండు, ఫలం ఏదైనా సరే- నేను సంతోషంతో స్వీకరిస్తాను." అన్నాడు.

కృష్ణుడు అలా అడగ్గానే కుచేలుడికి ఎక్కడ లేని దుఃఖం ముంచు కొచ్చింది. తాను తెచ్చింది దోసెడు అటుకులు. అవి ఎవరైనా చూస్తే నవ్వి పోతారు. అవి కృష్ణుడికి ఇవ్వడం ఎలా?- కాని ఏం చేస్తాడు? తన దగ్గర ఇంకేమున్నది ఇవ్వడానికి- బదులు చెప్పలేక తల వాల్చుకున్నాడు కుచేలుడు సిగ్గుతో.



అయితే భగవంతుడైన కృష్ణుడికి సర్వం తెలుసు. కుచేలుడికి సకల సంపదలూ ఇవ్వాలనుకున్నాడు. కుచేలుడి దగ్గర ఉన్న చిన్న గుడ్డమూట పట్టుకుని కృష్ణుడు "ఇదేమిటి మిత్రమా? నా కోసం ఏదో తెచ్చినట్లున్నావే!-" అన్నాడు.

కుచేలుడు మాట్లాడ లేక కంట తడి పెట్టాడు. అప్పుడు కృష్ణుడు తనంతట తానే ఆ మూట తీసుకుని విప్పి చూశాడు. "ఓహో! నా కోసం అటుకులు తెచ్చారా? అటుకులంటే నాకెంతో ఇష్టం సుమా!" అంటూ ఒక పిడికెడు అటుకులు తీసుకుని తిన్నాడు. "చాలా రుచిగా ఉన్నాయి" అంటూ మరో పిడికెడు తీసుకోబోతుండగా రుక్మిణి అడ్డు వచ్చింది.

జగన్నాథా చాలు, చాలు ఒక పిడికెడు అటుకులు తిన్నందుకే ఈ బ్రాహ్మణోత్తముడికి సకల ఐశ్వర్యాలు ప్రసాదించారు. ఇక వద్దు" అంటూ వారించింది.

అవును. ఇంకా కుచేలుడి అటుకులు కృష్ణుడు భక్షిస్తే, లక్ష్మీదేవి అయిన తానే అతని ఇంట శాశ్వతంగా ఉండి పోవలసి వస్తుందని తెలిసి, రుక్మిణీదేవి అలా చేసింది.

తరువాత కృష్ణుడు, కుచేలుడికి ఆతిథ్యం ఇచ్చాడు. స్నానం చేయించి నేత వస్త్రాలు కట్ట బెట్టాడు. షడ్రసోపేతమైన భోజనం పెట్టించి, కర్పూర తాంబూలం ఇచ్చి, హంసతూలికా తల్పం పై పరుండిబెట్టి సకలోపచా



రాలు చేశాడు. కుచేలుడి సంతోషానికి మేర లేదు. తన జన్మ సార్థకమైనట్లు అనుకున్నాడు. అయితే తన దారిద్ర్య బాధ చెప్పుకుని, కృష్ణుణ్ని ఏదైనా అడగ డానికి కుచేలుడికి నోరు రాలేదు. కృష్ణుణ్ని ఏమీ అడగకుండానే మళ్ళీ తన ఊరికి బయలుదేరాడు. కృష్ణుడు ఆదరంతో కొంత దూరం వెంట వచ్చి అతన్ని సాగనంపాడు.

కుచేలుడు తన ఇంటికి వచ్చి చూసే సరికి ఎక్కడ లేని అద్భుతం జరిగింది! అతని పర్ణకుటీరం అక్కడ లేదు. దాని స్థానంలో దివ్య భవనం వెలిసింది. ఆ భవనంలో ద్వారపాలకులు పరిచారకులు దాసీజనం ఉన్నారు. సేవకులు ఎదురు వచ్చి కుచేలుణ్ని లోపలికి తీసుకుని వెళ్ళారు. అక్కడ అతని భార్య కనిపించింది. ఆమె దివ్య భూషణాలు అలంకరించుకుని అపర లక్ష్మీదేవిలా దాసీజనం మధ్య ఉంది. భర్త రాగానే అతని పాదాలకు ప్రణమిల్లి పూజించింది. ఆనందంతో పొంగిపోయింది. కుచేలుడు ఇదంతా చూసి సంభ్ర మాశ్చర్యాలలో మునిగిపోయాడు. కొంతసేపు అతని నోట మాట రాలేదు. తరువాత ద్వారకలో జరిగిన సంగతులు భార్యకు చెప్పాడు. కోరకుండానే ఇంతటి ఐశ్వర్యం ప్రసాదించాడు కృష్ణపరమాత్మ అనుకొని ఆ భార్యాభర్తలు ఆనందంతో పొంగిపోయారు. కృష్ణుణ్ని పదే పదే ధ్యానిస్తూ ఆయన మహిమలు కీర్తించారు.

ఆ విధంగా కటిక దరిద్రుడైన కుచేలుడు భగవంతుడి అనుగ్రహానికి పాత్రుడై అష్టైశ్వర్యాలు అనుభవించాడు. భగవద్భక్తి ఎంత గొప్పదో,

ఆయన వాత్సల్యం ఉన్నవారికి ఎలా శుభాలూ, సుఖాలూ కలుగుతాయో నిరూపిస్తుంది ఈ పుణ్యకథ.

# మరొక అద్భుత లీల

ఒకసారి కృష్ణుడూ, అర్జునుడూ ద్వారకానగరంలో ఉండగా ఒక విచిత్రం జరిగింది. ఒకనాడు ఒక బ్రాహ్మణుడు చనిపోయిన తన కుమారుడి శవాన్ని తీసుకుని కృష్ణుడి భవనం ముందు ఉంచాడు. గోడు గోడున దుఃఖించ మొదలు పెట్టాడు.

భటుల వలన ఆ విషయం తెలిసి కృష్ణుడూ, అర్జునుడూ అక్కడికి వచ్చారు. ఏం జరిగిందని కృష్ణుడు బ్రాహ్మణుని అడిగాడు.

అప్పుడా బ్రాహ్మణుడు "శ్రీ కృష్ణా! వీడు నా కుమారుడు పుట్టగానే చనిపోయాడు. ఇంతకు ముందు నాకు ఎనిమిది మంది పుత్రులు జన్మించారు. వారూ ఇలాగే పుట్టగానే ప్రాణాలు విడిచారు. ఎందుకిలా జరిగింది. నూరేళ్ళు బ్రతకవలసిన బిడ్డలు ఇలా కారణం లేకుండా అకాల మరణం పొందారంటే దానికి ఏదో కారణం ఉండాలి. రాజు అధర్మ వరుడైతే ఇలాంటివి సంభవిస్తాయని పెద్దలు చెపుతారు. నీవు ధర్మమూర్తివని, భగవంతుడి అవతారమని అందరూ చెపుతారే. కాని నీ పరిపాలనలో ఏదో దోషం ఉన్నది. లేకపోతే నాకు

ఈ దురవస్థ సంభవించదు. కాబట్టి నా బిడ్డలంతా చనిపోవడానికి నీ అధర్మ పాలనే కారణం" అని ఆరోపణ చేస్తూ. బిగ్గరగా ఏడవడం మొదలు పెట్టాడు.

అయితే. కృష్ణ పరమాత్మ ఏమీ బదులు చెప్పలేక ఊరుకున్నాడు. ఆ బ్రాహ్మణుడికి జరిగిన అన్యాయం చూసి అర్జునుడికి ఎంతో జాలి కలిగింది.

"బ్రాహ్మణోత్తమా! నీవు దుఃఖించకు. యమధర్మరాజుతో పోరాడి చనిపోయిన నీ బిడ్డలను నేను తిరిగి తెస్తాను. నీవు నిశ్చింతగా ఉండు" అని మాట ఇచ్చాడు.

కృష్ణుడు ఏమీ మాట్లాడక, తనలో తాను నవ్వుకున్నాడు. దేవేంద్రుడు అంతటి వాణ్ని జయించానని, మహావీరుడనని అర్జునుడికి గర్వం ఉన్నది ఈ బ్రాహ్మణుడి బిడ్డలను తీసుకుని వచ్చి అప్పగించడం తనకిక లెక్కలోనిది కాదని అనుకున్నాడతను.

"విప్రోత్తమా! ఈసారి నీకు సంతానం కలిగేటప్పుడు ముందుగా నాకు తెలియపర్చు. చేయవలసినది చేస్తాను." అని గర్వంగా పలికాడు అర్జునుడు.

అర్జునుడికి తన మహిమ చూపించి, అతనికి గర్వభంగం చేయాలనుకున్నాడు కృష్ణుడు.

కొన్నాళ్ళకు బ్రాహ్మణుడి భార్య మరల ప్రసవించే సమయం ఆసన్నమైంది. అప్పుడా బ్రాహ్మణుడు పరుగు పరుగున అర్జునుడి దగ్గరకి వచ్చి ఆ విషయం తెలియజేశాడు! అర్జునుడు వెంటనే ధనుర్బాణాలు తీసుకుని బ్రాహ్మణుడి

ఇంటికి వెళ్ళాడు. తన దివ్యాస్త్రాలను ప్రయోగించి,పురుటింటి చుట్టూ బాణాలతో ఒక పంజరం అల్లాడు. మృత్యువు వస్తే ఎదిరించడానికి సిద్ధంగా ఉన్నాడు.

బ్రాహ్మణుడి భార్య ప్రసవించింది. మగబిడ్డను కన్నది. కాని ఎప్పటి లాగే ఆ పిల్లవాడు పుట్టగానే చనిపోయాడు. బ్రాహ్మణుడూ, అతని భార్యా పెద్ద పెట్టున శోకించారు. "అర్జునా! ఏమైంది నీ వాగ్దానం ? మృత్యువు ఎత్తుక పోయిన నా బిడ్డలను తెచ్చిస్తానన్నావే.ఇదేనా నీ ప్రతిజ్ఞ? ఇంతేనా నీ ప్రతాపం" అని నిందా వాక్యాలు పలికాడు.

అర్జునుడికి రోషం వచ్చింది. వెంటనే బయలుదేరి యమలోకానికి వెళ్ళాడు. అక్కడ బ్రాహ్మణ కుమారుడు కనిపించలేదు. తరవాత ఇంద్రలోకానికీ, వరుణలోకానికీ, అలాగే దిక్పాలకులందరి లోకాలకూ వెళ్ళి వెదికాడు. కాని బ్రాహ్మణ పుత్రుని జాడ కనిపించలేదు. చివరకు విసిగి వేసారి ద్వారకకు తిరిగి వచ్చాడు. ప్రతిజ్ఞ నెరవేర్చలేకపోయినందుకు ఎంతగానో చింతించాడు. గాండీవంతో సహా అగ్ని ప్రవేశం చేసి అసువులు వీడడానికి సన్నద్ధుడై నాడు.

అప్పుడు కృష్ణుడు, అధైర్యపడవద్దని, బ్రాహ్మణ కుమారులు ఎక్కడున్నదీ తాను చూపిస్తానని చెప్పి అర్జునుడి ఆత్మాహుతి ప్రయత్నాన్ని మాన్పించాడు.

పిమ్మట శ్రీకృష్ణుడు, అర్జునుణ్ని తన దివ్యరథంపై కూచోబెట్టుకుని ప్రయాణమయినాడు. రథం పడమటి దిశగా పోతున్నది ఆ విధంగా ఏడు

దీవులూ, ఏడు సముద్రాలూ ఏడు కులపర్వతాలూ దాటివెళ్ళింది రథం. తుదకు లోకాలోకం కూడా అతిక్రమించి పోతున్నాడు కృష్ణుడు. అర్జునుడికి ఏమీ అర్థం కాలేదు. అంతా అయోమయంగా ఉంది. లోకాలోకం తరవాత అంతా గాఢాంధ కారం ఆవరించిఉంది. రథం ముందుకు సాగలేదు. అప్పుడు కృష్ణుడు కోటి సూర్యప్రకాశమయిన తన సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు. ఆ చక్రాయుధం చీకట్లను చీల్చివేసింది. దివ్యకాంతులు వెదజల్లింది, వారు ఒక అద్భుతమయిన ప్రదేశం చేరుకున్నారు. అక్కడ అంతా కాంతి. కనులు మిరుమిట్లు గొలిపే తేజస్సు. అర్జునుడు చూడలేక కళ్ళు మూసుకున్నాడు. అప్పుడు కృష్ణుడు రథం ఆపి, అర్జునుడితో అటు చూడమని చెప్పాడు. నారాయణుడున్న ప్రదేశం అది. కృష్ణార్జునులు భక్తితో నారాయణుడికి మ్రొక్కారు, అనేక విధాల స్తుతించారు.

అప్పుడు నారాయణుడు "కృష్ణార్జునులారా మీరిద్దరూ నా అంశతో భూమిమీద అవతరించిన మహనీయులు. మిమ్మల్ని ఒకసారి కళ్ళారా చూడాలనిపించింది. ఆ బ్రాహ్మణ పుత్రులను పుట్టగానే మాయం చేసి దాచి ఉంచిన వాణ్ని నేనే. మిమ్మల్ని ఇక్కడికి రప్పించడానికే నేను ఆ పనిచేశాను" అని పలికాడు. ఇలా అని, ప్రాణాలతో ఉన్న బ్రాహ్మణ పుత్రులందరినీ వారికి అప్పగించాడు.



అర్జునుడి ఆశ్చర్యానికి అంతులేదు. తరువాత కృష్ణుడూ, అర్జునుడూ దివ్య తేజస్సుతో వెలిగిపోతున్న నారాయణుని వేదమంత్రాలతో స్తోత్రం చేసి, మ్రొక్కారు. ఆయనవద్ద సెలవుతీసుకుని మరల రథంపై బయలుదేరి ద్వారక చేరుకున్నారు.

పిమ్మట అర్జునుడు బ్రాహ్మణ పుత్రులను తీసుకునిపోయి బ్రాహ్మణుడికి అప్పగించారు. ఆ విప్రుడు బ్రతికి వచ్చిన తన బిడ్డలను చూసి ఆనందంతో మునిగిపోయాడు. కృష్ణార్జునులకు సాగిలపడి మ్రొక్కాడు.

అప్పుడు అర్జునుడు కృష్ణ పరమాత్మ చేసిన అద్భుతం తలచుకుని. ఇదంతా కృష్ణుడిలీల యనీ, తాను కేవలం నిమిత్త మాత్రుడననీ తెలుసుకున్నాడు. అతనిలోగల అహంకారం అణిగిపోయింది.





# ద్రౌపది మాన సంరక్షణ

ద్వాపరయుగంలో దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించడానికి భూమి భారాన్ని తొలగించడానికి, శ్రీకృష్ణుడుగా అవతరించిన భగవంతుడు ఎన్నో యద్భుతాలు చేశాడు.

జూదంలో మోసంచేసి పాండవుల రాజ్యాన్ని అపహరించారు. కౌరవులు. ద్రౌపదిని కూడా జూదంలో పందెం ఒడ్డి ఓడిపోయారు పాండవులు. అప్పుడు దుర్యోధనుడు, బలాత్కారంగా ద్రౌపదిని నిండుసభకు రప్పించి భీష్మ ద్రోణాది పెద్దలు, ప్రముఖులు చూస్తుండగా ద్రౌపదిని పరాభవించారు. నిస్సహాయ స్థితిలో ద్రౌపది ఆర్తనాదాలు చేస్తుండగా దుర్యోధనుడి తమ్ముడు దుష్టుడు అయిన దుశ్శాసనుడు ఆమె చీరలు వలిచాడు. అప్పుడు సాధ్వి ద్రౌపది "కృష్ణా! ఆపద్బాంధవా! ఆర్తత్రాణ పరాయణా! మహా విపత్తులో ఉన్నాను. నా మానాన్ని కాపాడు కృష్ణా! నీవే నాకు దిక్కు!" అని అనేక విధాల ప్రార్థించింది.

అప్పుడు ద్వారకలో ఉన్న కృష్ణుడికి భక్తురాలయిన ద్రౌపది ఆర్త నాదాలు చెవినపడ్డాయి. తక్షణమే ఆమెను కాపాడడానికి నిశ్చయించుకున్నాడు. ఆయన మహిమ వలన, ద్రౌపది చీరలు దుశ్శాసనుడు విప్పుతుండగా ఒకదాని వెంట ఒకటి అంతులేకుండా చీరలు రాసాగాయి. సభలో పెద్ద కలవరం పుట్టింది. అందరూ అది చూచి భయభ్రాంతులతో మునిగిపోయారు. అంతు

లేకుండా వస్తున్న చీరలు విప్పలేక దుశ్శాసనుడికి అలసట వచ్చింది. వళ్ళంతా చెమటపట్టి ఆయాసంతో కూలబడిపోయాడు.

ఆ విధంగా కృష్ణుడు ద్రౌపది మానసంరక్షణ చేశాడు.

పాండవులు పన్నెండేండ్ల అరణ్యవాసం ఒక ఏడాది అజ్ఞాతవాసం చేసి పడరాని కష్టాలు పడ్డారు. ఆ తరవాత వచ్చి అడిగినా కూడా రాజ్యంలో వారి భాగం వారికి ఇవ్వడానికి నిరాకరించాడు దుర్యోధనుడు. అప్పుడు పాండవులు కృష్ణుణ్ని రాయబారిగా పంపారు. కృష్ణుడు వెళ్ళి సంధి మాటలు చెప్పినా కౌరవులు వినలేదు. పైగా సభలోనే ఒంటరిగా ఉన్న కృష్ణుణ్ని కట్టి వేయడానికి దుర్యోధనాధులు ప్రయత్నించారు,

వారి అజ్ఞానానికి నవ్వుకుని కృష్ణపరమాత్మ తన విశ్వరూపాన్ని ప్రదర్శించి కౌరవులకు విభ్రాంతి కలిగించి వారు మూర్ఛపోయేలా చేశాడు.

తరవాత కురుక్షేత్రంలో కౌరవులకూ పాండవులకూ గొప్పయుద్ధం జరిగింది. అదే మహాభారత యుద్ధం. ఆ యుద్ధంలో ధర్మరక్షణార్థం కృష్ణుడు పాండవుల పక్షం వహించాడు. అర్జునుడికి రథసారధిగా వుండి, పాండవులకు సహాయం చేశాడు.

యుద్ధం మొదలయ్యే సమయంలో; గురువులతోను సోదరులతోను బంధుమిత్రులతోను యుద్ధం చేయడానికి అర్జునుడు వెనుకాడి ఎక్కడలేని విచారంతో మునిగినప్పుడు కృష్ణపరమాత్మ ఆతనికి తత్త్వాన్ని బోధించాడు. అదే పరమ పవిత్రమైన భగవద్గీత. అప్పుడే అర్జునుడికి విశ్వరూపం చూపించి సర్వం

గానేనని నీవు కేవలం నిమిత్తమాత్రుడవని అన్నీ తన సంకల్పం వల్లనే జరుగుతుంటాయని అర్జునుడికి తెలియజెప్పి జ్ఞానోదయం కలిగించాడు. కర్తవ్యాన్ని బోధించాడు. భారతయుద్ధంలో పాండవులకు అనేక ఆపదలు సంభవించినప్పుడల్లా కృష్ణుడు ఎప్పటికప్పుడు తన లీలలు ప్రదర్శిస్తూ ఉపాయాలు చెపుతూ ఆపదలను తొలగించి పాండవులకు అఖండ విజయం చేకూరుస్తూ వచ్చాడు.

## భారత యుద్ధంలో కృష్ణుడి పాత్ర

కౌరవులపక్షాన మహావీరుడు, భీష్మాచార్యుడు భయంకరంగా పోరాడుతూ పాండవ సేనలను చిన్నాభిన్నం చేస్తున్నప్పుడు తట్టుకోలేక పాండవులు అధైర్యపడిపోయారు. అప్పుడు జయించే ఉపాయం చెప్పమని భీష్ముని అడగవలసినదని ప్రోత్సహించినవాడు కృష్ణుడే. ఆయన సలహాపై ధర్మరాజు తాతగారి దగ్గరికి వెళ్ళి మ్రొక్కి తమకు జయంకలిగే ఉపాయం చెప్పమని కోరాడు. ఆడవారితో పూర్వజన్మలో స్త్రీ అయినవాడితో యుద్ధం చేయనని, పూర్వజన్మలో స్త్రీ అయిన శిఖండిని ముందుంచుకుని బాణాలువేస్తే కూలిపోతానని భీష్ముడు మార్గం చెప్పాడు. ఆవిధంగా అర్జునుడు శిఖండిని ముందుంచుకుని బాణాలు వేయగా, భీష్ముడు కూలిపోయాడు.



ద్రోణాచార్యుడు పద్మవ్యూహం పన్నినపుడు అర్జునుడి కుమారుడు అభిమన్యుడు ఆవ్యూహంలో ప్రవేశించి కౌరవసేనలను కౌరవవీరులను తుక్కు తుక్కుగా కొట్టాడు. అతనికి సహాయంగా పద్మవ్యూహంలో ప్రవేశించడానికి ధర్మజ భీమ నకుల సహదేవులు వెళ్ళగా సైంధవుడు అడ్డు తగిలి శివుడి వర ప్రభావంతో వారిని గెలిచాడు. ఆసమయంలో వేరేచోట యుద్ధంచేస్తున్న అర్జునుడు తిరిగివచ్చి పుత్రుడి మరణానికై చింతించి అభిమన్యుడి చావుకు కారణమైన సైంధవుని ప్రొద్దుకూకేలోగా హతమారుస్తానని లేకపోతే గాండీవంతో అగ్నిప్రవేశం చేస్తాననీ ప్రతిజ్ఞచేశాడు. ఆసంగతితెలిసి ద్రోణాచార్యుడు గొప్ప వ్యూహంపన్ని సైంధవుని కాపాడడానికి ప్రయత్నించగా కృష్ణుడి సహాయంతో అర్జునుడు గొప్పగా యుద్ధం చేసినప్పటికీ సైంధవుని పట్టుకోవడం సాధ్యం కాలేదు. ప్రొద్దుక్రుంగవచ్చినందున అర్జునుడి ప్రతిజ్ఞ వ్యర్థమవుతుందనీ అతనికి అగ్నిప్రవేశం తప్పదని అంతా అనుకున్నారు. ఆ విపత్సమయంలో కృష్ణుడు తన మాయతో. సూర్యుణ్ని కనపడకుండా చేశాడు. పొద్దు కూకిందనే భ్రాంతి కలిగించాడు. చీకటి పడిందికదా అని సైంధవుడు బయటికి వచ్చిన సమయంలో కృష్ణుడి ప్రోత్సాహంతో అర్జునుడు అతని తల నరికివేశాడు. అప్పుడు కృష్ణుడు తన మాయను ఉపసంహరించగా చీకటి పోయి మళ్ళీ సూర్యుడు కనిపించాడు. ఆ విధంగా సైంధవుడు హతమయ్యేలా చేసి అర్జునుణ్ని కాపాడాడు కృష్ణుడు.



ఆ రీతిగానే ఆచార్యద్రోణుని పడగొట్టలేక, ఆయన బాణధాటికి తట్టుకో లేక పాండవులు విలవిలలాడిపోతున్నప్పుడు కూడా కృష్ణుడు ఉపాయం చెప్పాడు. యుద్ధంలో అశ్వద్ధామ అనే పేరుగల ఏనుగు చనిపోగా, ద్రోణాచార్యుడి ప్రియ పుత్రుడు అశ్వత్థామ యుద్ధంలో మరణించాడని ధర్మరాజుచేత అబద్ధమాడించాడు. కృష్ణుడు. అది విని ద్రోణుడు దుఃఖం భరంచలేక, ధనుర్బాణాలు జారవిడిచాడు. ఆ సమయంలో పాండవ సేనాని ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యుడి తల నరికి వేశాడు.

దుర్యోధనుడికీ భీముడికీ గదా యుద్ధంజరుగుతున్నప్పుడు అధర్మంగా భీముడిచేత దుర్యోధనుడి తొడలు విరగ్గొట్టించి అతను కూలిపోయేలా చేసిన వాడూ కృష్ణుడే. భారత యుద్ధంలో ఇలా కృష్ణుడు కౌరవులనాశనానికీ పాండవుల విజయానికి తోడుపడిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి.

యుద్ధంలో కౌరవులంతా నశించిపోయారు. అప్పుడు ద్రోణాచార్యుడి కుమారుడు అశ్వత్థామ "పాండవులనేవారు లేకుండా పోవుగాక" అని సంకల్పించి బ్రహ్మశిరోనామకం అనే దివ్యాస్త్రాన్ని ప్రయోగించాడు. అప్పుడూ కృష్ణుడే పాండవులను కాపాడాడు. ధర్మరాజు, భీముడు, అర్జునుడు. నకులసహదేవులు ద్రౌపది మాత్రమే పాండవుల పక్షాన బ్రతికి ఉన్నారు అప్పుడు. అభిమన్యుడి భార్య, అర్జునుడి కోడలు అయిన ఉత్తర గర్భవతిగా ఉన్నది. ఆమెకు కలగ బోయే బిడ్డడే పాండవుల వంశాంకురం. అశ్వత్థామ ప్రయోగించిన దివ్యాస్త్రం,

ఉత్తర గర్భంలోని శిశువును కూడా చంపబోయింది. అప్పుడు కృష్ణుడు తన మహిమతో ఉత్తర గర్భంలోని శిశువును కాపాడి పాండవుల వంశాన్ని నిల బెట్టాడు. ఉత్తర గర్భాన పుట్టిన ఆ పిల్లవాడే పరీక్షిత్తు. కఠిన పరీక్షకు గురి అయి బ్రతికినవాడు కాబట్టె అతనికి పరీక్షిత్తు అని పేరు వచ్చింది. పాండవుల తరవాత హస్తినాపురసామ్రాజ్యాన్ని పాలించినవాడు అతడే.

ఆ విధంగా కృష్ణుడి అనుగ్రహం వలన పాండవులు కష్టాలన్నీ గట్టెక్కి రాజ్యం చేజిక్కించుకున్నారు.

యుద్ధంలో తన కుమారులు దుర్యోధనాదులు. ఇతర ఆత్మబంధువులు అంతా మరణించినందుకు గ్రుడ్డివాడయిన ధృతరాష్ట్రుడు ఎంతగానో దుఃఖిం చాడు. పాండవులు, కృష్ణుడు ఆయన దగ్గరికి వెళ్ళి ఎన్నో విధాల ఊరడించారు. తన కుమారుడు దుర్యోధనుడి దుష్టబుద్ధివల్లనే కులం నశించిందనీ. ఇందులో పాండవుల దోషం లేదనీ తెలుసు గనుక ధృతరాష్ట్రుడు పాండవులను ప్రేమతో ఆదరించి కంటతడిపెట్టాడు.

అయితే, తన నూరుగురు కొడుకులనూ పొట్టన బెట్టుకున్న భీమ సేనుడిపై మాత్రం ఆయనకు కోపం పోలేదు. భీముడు దగ్గరికి రాగానే "రా భీమసేనా! రా నాయనా, ఒక్కసారి నిన్ను కౌగలించుకోనివ్వు తండ్రీ" అని ప్రేమతో దగ్గరకి పిలిచాడు.

ధృతరాష్ట్రుడి మనస్సులో కుట్ర ఉన్నదని తెలిసిన కృష్ణుడు, భీముణ్ని వెళ్ళవద్దని చెప్పి, అక్కడే భీముడిలా బలంగా ఉన్న నిలువెత్తు ఇనుప విగ్రహాన్ని ధృతరాష్ట్రుడి ముందుకు త్రోశాడు. భీముడే వచ్చాడనుకొని, గ్రుడ్డిరాజు రెండుచేతులూ చాచి, కోపంతో ఆ విగ్రహాన్ని గట్టిగా కౌగలించు కున్నాడు. అప్పుడా విగ్రహం ముక్కలు ముక్కలైపోయింది. కృష్ణుడు కనుక అలా చేయకపోతే ధృతరాష్ట్రుడి కోపానికి భీముడు ఆహూతి అయిపోయి ఉండేవాడు. ఆ లోహ విగ్రహం ఎవరిదో కాదు, భీమసేనుడిదే. యుద్ధంలో భీముడ్ని జయించాలన్న పట్టుదలతో దుర్యోధనుడు భీముడిలాంటి ఇనుప విగ్రహాన్ని చేయించి, దాన్ని ముందు పెట్టుకుని గదాయుద్ధం అభ్యాసం చేస్తూ వచ్చాడు.

విగ్రహం అలా పిండి పిండి అయిపోయిన తరవాత ధృతరాష్ట్రుని సమీపించి "రాజా! దేహ బలంలో నిన్ను మించినవారు లేరు. భీమసేనుడిపై మీకు గల కోపం సంగతి నాకు తెలుసు. అతన్ని రక్షించడం కోసం. నీ కొడుకు తయారుచేయించిన లోహ విగ్రహాన్ని నేనే నీ ముందుకు నెట్టాను. నీ కొడుకు చేసిన పనులు గుర్తుకు తెచ్చుకుని భీముడిపై కోపం విడిచి పెట్టు" అని పలికాడు.

ధృతరాష్ట్రుడు "కృష్ణా! నీవు సర్వజ్ఞుడవు. నీ లీలలు ఎవరు తెలుసుకోగలరయ్యా! కడుపు దుఃఖం భరించలేక భీముణ్ని అలా చేయాలనుకున్నాను. నన్ను మన్నించు" అని వేడుకుని శాంతించాడు.

హస్తినాపురంలో ధర్మరాజు పట్టాభిషేకం వైభవంగా జరిగింది. తమ్ముల సహాయంతో ధర్మరాజు ప్రజలను కన్నబిడ్డల్లా పాలిస్తూ వచ్చాడు. కృష్ణుడి అనుగ్రహంతో అండదండలతో అశ్వమేధయాగం గొప్పగా చేశాడు.

ఆ విధంగా ధర్మరాజు ముప్పయి ఆరేండ్లు ధర్మంగా పరిపాలన సాగించి తన పేరు సార్థకం చేసుకున్నాడు. అప్పుడు హస్తినాపురంలో మున్నెన్నడూ లేని అపశకునాలు కనిపించాయి. అలాగే ఇక్కడ ద్వారకలో కూడా ఎన్నో వుత్పాతాలు పొడగట్టాయి.



# యాదవకులంలో ముసలం

యాదవవీరులంతా అవినీతి పరులైనారని జన రాజ్యంలో అన్యాయం అక్రమం పెరిగిపోతున్నాయనీ. తను ఎందుకోసం భూమి మీద అవతరించాడో, ఆ పని అయిపోయిందని శ్రీకృష్ణుడికి తెలుసు. యాదవులు మహావీరులు కనుక వారిని మరెవ్వరూ జయించలేరని వారిలో వారే పోట్లాడుకుని మరణించవలసి వుంటుందని ఎరిగిన వాడై అందుకు అవసరమయిన పరిస్థితులను కల్పించి నాడు.

ఒకనాడు విశ్వామిత్రుడు, కణ్వుడు, నారదుడు మొదలయిన మహర్షులు కృష్ణుణ్ని దర్శించాలని ద్వారకకు వచ్చారు, వారిని చూడగానే యాదవ వీరులకు దుర్బుద్ధి పుట్టింది. మునులను ఆటపట్టించాలనుకున్నారు. వారిలో సాంబుడనేవాడున్నాడు. అతను కృష్ణుడికి జాంబవతి వలన పుట్టిన కుమారుడు. యాదవులు వాడికి ఆడవేషం వేశారు. కడుపు ఎత్తుగా ఉండేలా అతని పొట్టకు గుడ్డలు చుట్టారు. ఇలా వేసి సాంబుణ్ని మహర్షుల దగ్గరికి తీసుకుపోయి "మునురాలా! ఈ అమ్మాయి గర్భవతి. మీరు జరిగిందీ, జరగ బోయేదీ చెప్పగల మహాత్ములు. ఈమె గర్భాన ఏ బిడ్డ పుడుతుందో చెప్పండి" అని అడిగారు.

మునులు దివ్యదృష్టితో అంతా తెలుసుకున్నారు. యాదవ కుమారులు మూర్ఖులై తమను ఎగతాళి చేయడానికి ప్రయత్నించినందుకు మహర్షులకు కోపం వచ్చింది. కృష్ణపరమాత్మ జన్మించిన యాదవకులానికి చేటుకాలం సమీపించిం దని కూడా వారు తెలుసుకున్నారు.

"దుష్టులారా! మమ్మల్ని ఆటలు పట్టిస్తున్నారా! మగవాడికి ఆడ వేషం వేసి, ఏపిల్ల పుడుతుందని అడుగుతున్నారా? వీడి కడుపున ఏపిల్లా పుట్టదు. మీకులాన్ని నాశనంచేసే పెద్ద ఇనుపరోకలి పుడుతుంది" అని పలికి వెళ్ళిపోయారు.

అది వినగానే యాదవ కుమారులకు ఎక్కడలేని భయం పుట్టింది. బుద్ధిపూర్వకంగా మునులకు అపచారం చేసి శాపానికి గురిఅయినామే అని విచా రించారు. ఆందోళనతో, భయంతో వెళ్ళి కృష్ణుడికి ఈవిషయం చెప్పారు. ఇలా జరుగుతుందని ఆయనకు ముందే తెలుసు. కౌరవపాండవులు యుద్ధం ముగిసిన తరవాత గాంధారి తనకు పెట్టిన శాపం గుర్తుకొచ్చింది కృష్ణుడికి.

'కృష్ణా! నీవు కపటివి. నీవు బుద్ధిపూర్వకంగా క్షత్రియ కులాన్ని నాశనం చేశావు. దాయాదులైన కౌరవ పాండవులు వైరంతో ఒకరినొకరు చంపు కున్నట్లే, నీవారైన యాదవులు కూడా చివరకు పరస్పరం కలహించుకుని నశించి పోతారు" అని ఆనాడు కడుపుకోతతో గాంధారి శపించింది కృష్ణుణ్ని. దానికి ఈ మునులశాపం తోడైందని అనుకున్నాడు కృష్ణుడు.

మహర్షులు అన్నట్లే సాంబుడి కడుపున పెద్ద ముసలం పుట్టింది. దాన్ని యాదవులు పగులగొట్టి ముక్కలు చేశారు. ఆ ముక్కలను మళ్ళీ పొడి చేసారు. ఆ ఇనుపపొడి సముద్రంలో పారపోసారు. ఎన్ని చేసినా విధి బలీయమైనది. దాన్ని ఎవరూ ఆపలేరు. ద్వారక అంతటా మృత్యువు తిరుగుతున్నట్లు అనేక దుశ్శకునాలు కనిపించాయి. యాదవస్త్రీలూ, పురుషులూ ధర్మం, దైవ భక్తి విడనాడి దురాచారులై ప్రవర్తించసాగారు.

అది కృష్ణపక్షం. త్రయోదశి, చతుర్దశి, అమావాస్య-ఈ మూడు తిధులూ కలిసినరోజు. ఆనాడే రాహుగ్రస్త సూర్యగ్రహణం, భారతయుద్ధం జరిగినప్పుడు కూడా ఇలాంటిదే సంభవించింది. మృత్యువు లాగుతున్నట్లుగా యాదవులంతా రథాలూ, గుర్రాలూ, ఇతర వాహనాలూ ఎక్కి ప్రభాసతీర్థానికి వెళ్ళారు. అక్కడ వళ్ళు తెలియకుండా మద్యం త్రాగారు. పిచ్చిమాటలు మాట్లాడుతూ వావి వరుసలు లేకుండా ఒకరినొకరు తిట్టుకున్నారు. చిలికి చిలికి గాలివాన అయినట్లు, కలహం మొదలై పెద్ద యుద్ధంగా మారింది. సముద్రంలో పోసిన రోకలి పొడినుండి పొడుగాటి తుంగ మొలుచుకునివచ్చింది. ఆతుంగ మూడు అంచుల మొన కలిగి, వాడి అయిన ఇనుపబాణాలల్లా ఉంది. ఆ తుంగ పెరికి యాదవవీరులు ఒకరినొకరు కొట్టుకుని చంపివేసుకున్నారు. సాత్యకి, కృతవర్మ, ప్రద్యుమ్నుడు, సాంబుడు, గదుడు, అనిరుద్ధుడు మొదలైనవారు ఒకరినొకరు హతమార్చుకున్నారు. యాదవ, వృష్ణి, అంధక, భోజులు ఇలా నశించిపోవడం

కళ్ళారా చూసి కృష్ణుడు, దారుకుని వెంటబెట్టుకుని బలరాముడు ఎక్కడున్నాడో అని వెదకసాగాడు.

బలదేవుడు వనంలో ఒకచోట యోగముద్రలో ఉండి అవతారం చాలించాడు. ఆయన ముఖంనుండి తెల్లని మహానాగు ఒకటి బయటకి వచ్చింది. ఆయన దేహం వదిలిపెట్టి వేయి శిరస్సుల ఆదిశేషుడిరూపంధరించి సముద్రంలో ప్రవేశించాడు.

అంతట కృష్ణుడు తన సారథి అయిన దారుకుని పిలిచి, వేగంగా హస్తినాపురానికి వెళ్ళి, యాదవులు నశించిపోయారని ధర్మరాజుకూ అర్జునుడికీ చెప్పి, అర్జునుణ్ని తక్షణం ద్వారకకు తీసుకుని రావలసినదిగా ఆజ్ఞాపించి పంపాడు.

అంతట కృష్ణుడు అవతారం చాలించదలిచినవాడై, వనంలో పొదల మధ్య పడుకుని యోగనిష్ఠలో ఉండిపోయాడు. అదేసమయంలో జరుడనే బోయవాడు అక్కడికి వచ్చాడు. ఎర్రని పద్మంలా మెరుస్తున్న కృష్ణుడిపాదం దూరంనుండి అతనికి కనిపించింది. అది ఒక జింక అని భ్రమపడి వేటగాడైన జరుడు గురిచూసి తన బాణంతో కొట్టాడు. అది వెళ్ళి అరికాలిలో గుచ్చుకున్నది.

జరుడు దగ్గరికివెళ్ళి చూసేసరికి నాలుగు చేతులతో, గొప్ప తేజస్సుతో వెలిగిపోతున్న శ్రీమహావిష్ణువు కనిపించాడు.

అయ్యో! భగవంతుని బాణంతో కొట్టానే అని జరుడు విచారించి ఆయనముందు మోకరిల్లి క్షమించమని వేడుకున్నాడు. కృష్ణుడు బోయవాడి భక్తికి మెచ్చి, అతనికి ముక్తిని ప్రసాదించి, అవతారం చాలించాడు.

ఇనుపరోకలి పొడిచేసినప్పుడు దానిలో ఒక చిన్న ముక్క ఉండి పోయింది. దాన్ని సముద్రంలో ఒక చేప మ్రింగింది. బోయవాడు ఆ చేపను పట్టుకుని తీసుకువెళ్ళి దాన్ని కోయగా లోపల ఇనుపముక్క కనిపించింది. దాన్ని సానబట్టి తన బాణానికి ములికిగా చేసుకున్నాడు. ఆ బాణంతోనే వాడిప్పుడు కృష్ణుణ్ని కొట్టాడు.

ఆవిధంగా యాదవకులంలో పుట్టిన ముసలం యాదవులందరి నాశనానికి కారణమైంది.

అంటట దారుకుని వలన యాదవులు నశించిపోవడం తెలుసుకున్న పాండవులు ఎంతగానో దుఃఖించారు. అర్జునుడు ద్వారకకు వచ్చి, యాదవ స్త్రీలను హస్తినా పురానికి తీసుకుని వెళ్ళడానికి ఏర్పాటు చేశాడు. రథాలపైన, గుర్రాలపైన ధనద్రవ్యాలతో యాదవస్త్రీలను ఎక్కించుకుని అర్జునుడు హస్తినా పురానికి వెడుతుండగా దారిలో కిరాతులు అడ్డగించి ధనాన్ని దోచుకున్నారు. మహావీరుడైన అర్జునుడు శ్రీకృష్ణుడు లేకపోవడంతో శక్తివిహీనుడైనాడు. మామూలు కిరాతులను కూడా అతను ఎదిరించలేకపోయాడు.

కృష్ణుడు నిర్యాణం చెందగానే ద్వారకానగరం దానంతట అదే సముద్రంలో మునిగిపోయింది.

అర్జునుడు యాదవస్త్రీలనూ బాలురనూ, వృద్ధులనూ హస్తినాపురం చేర్చి జరిగిన సంగతులన్నీ ధర్మరాజుకు తెలియజేశాడు. కలియుగం ప్రవేశించనున్నదనీ, తాముకూడా ఈ లోకాన్ని విడిచిపెట్టవలసిన తరుణం సమీపించినదనీ తెలుసుకున్న ధర్మరాజు మిగిలిన యాదవులకు ఆయా రాజ్యాలు అప్పగించాడు. తమ వంశంలో మిగిలివున్న పరీక్షిత్తుకు పట్టంకట్టి, ధృతరాష్ట్రుడికి



వైశ్య స్త్రీవలన పుట్టిన కుమారుడు యుయుత్సుని పరీక్షిత్తుకు సంరక్షకుడుగాను, కృపాచార్యుణ్ణి గురువుగాను నియమించి బ్రాహ్మణులకూ పేద జనులకూ విధి విహితంగా దాన ధర్మాలు చేసి విరాగి అయి తమ్ములతోనూ ద్రౌపదితోను మహా ప్రస్థానం చేశాడు.

ఆవిధంగా ద్వాపరయుగంలో మహావిష్ణువు కృష్ణుడుగా అవతరించి దుష్టులను శిక్షించాడు. శిష్టులను రక్షించాడు. భూభారాన్ని తొలగించాడు. అన్నీ చేసేవాడూ చేయించేవాడూ తానేనని, తన భగవత్తత్వాన్ని ప్రత్యక్ష్యంగా చూపాడు. ఎన్నెన్నో మహిమలు ప్రదర్శించాడు. లీలామానుష విగ్రహుడై భాసించాడు. అసంఖ్యాకమైన శ్రీకృష్ణుడి లీలలు వర్ణించడం ఎవరితరమూకాదు. సాధారణ మానవులు కృష్ణతత్వాన్ని తెలుసుకోలేరు. భక్తులూ పరమ భాగవతోత్తములూ మాత్రమే ఆయన లీలలు అర్ధమవుతాయి.

గోవిందుడనీ, గోపాలుడనీ, వాసుదేవుడనీ, కేశవుడనీ, నంద నందకుడనీ, అచ్యుతుడనీ, జనార్దనుడనీ, మురళీధరుడనీ, మాధవుడనీ, గోపీజన మానసచోరుడనీ, దేవకీ నందనుడనీ, మాధవుడనీ, శిఖిపింఛమౌళి అనీ, నల్లనయ్య అనీ- ఇలా అనేక నామాలతో భాసించిన శ్రీకృష్ణపరమాత్మలీలలు చదివినవారికీ, విన్నవారికీ సమస్త సుఖాలూ, శుభాలూ లభిస్తాయి.



